mohan PUBLICATIONS

నేటి దినపత్రిక
# సూర్య
www.suryaa.com

ఆదివారం

# మహా శివరాత్రి

19 ఫిబ్రవరి 2017

ప్రత్యేక సంచిక

2017











## చైర్మన్‌తో ముఖాముఖి





**ప్రశ్నః తమిళనాడులో పన్నీర్‌సెల్వం ను కాకుండా పళని ని గవర్నర్ పిలవడం ఎంతవరకు సబబు.**

జవాబు : గవర్నర్ రాజ్యాంగం ప్రకారమే నడుచుకోవాల్సి ఉంటుంది. ఆయన స్వంత నిర్ణయాలు పనికి రావు. మెజార్టీ పళని వైపే ఉంది కాబట్టి ఆయన్ను పిలిచారు. పన్నీర్ సెల్వం కు కూడా బలనిరూపణకు అవకాశం ఇవ్వాల్సిందన్న వాద నలు కూడా ఉన్నాయి. పన్నీర్ ఇప్పటికే ముఖ్యమంత్రి గా ఉన్నాడు కాబట్టి ఆయన్ను ముందుగా పిలిచి బలనిరూపణ జరగ నప్పుడు పళనికి అవకాశం ఇవ్వాల్సి ఉండింది అన్న విష యమై రాజ్యాంగ నిపుణులు చర్చిస్తున్నారు.

అయితే పన్నీర్ సెల్వం రాజీనామా చేసినందున ఆయన ఆప ద్ధర్మ ముఖ్యమంత్రిగానే ఉన్నారు తప్ప ఆయనకు ముఖ్య మంత్రిగా అధికారాలు ఉండవు. ఆయనను కాదని ఎమ్మెల్యేలు శశికళను తమ నాయకురాలిగా ఎన్నుకున్నారు. గవర్నర్ ఆలస్యం చేయకుండా పిలిచి ఉంటే శశికళే ముఖ్య మంత్రి అయ్యేది. అయితే ఆమెను పిలవకుండా తీవ్ర జాప్యం చేయడం వెనుక గవర్నర్ ముందు చూపు ఉంది. ఆమె కేసు తీర్పు వెలువడనున్నందునే గవర్నర్ అలా చేశారన్నది కూడా అర్ధమవుతుంది.

శశికళ దోషిగా తేలడంతో ఆమె ను ముఖ్యమంత్రి చేయలేరు కాబట్టి ఆమె స్థానంలో పళని సీను మీదికొ చ్చారు. ఎమ్మెల్యేలు ఆయన్నే నేతగా ఎన్నుకున్నారు. కాబట్టి ఆయన్ను ముఖ్యమంత్రి పీఠం పై కూర్చోబెట్టడం సరైనదే.

**ప్రశ్న : శశికళ కు శిక్షపడింది కదా... జయలలితకు సుప్రీం కోర్టు విధించిన జరిమానా ఎవరు కడతారు,**

జవాబు : సుప్రీంకోర్టు విధించిన జరిమానా చెల్లింపు విషయంలో ఇబ్బందులేమీ ఉండవు. ఎందుకంటే జయ లలిత పేరున కోట్లాదిరూపాయల ఆస్థులు ఉన్నాయి. వాటికి వారసులు ఎవరో తేలాల్సి ఉంది. వారసులు తామేనని ఎవ రైనా ముందుకు వచ్చి అందుకు తగ్గ సాక్షాధారాలు చూపిస్తే ఆ ఆస్తులను వారికి అప్పగిస్తారు. వారే సుప్రీంకోర్టు విధించిన జరిమానా చెల్లిస్తారు. లేదంటే ఆమె ఆస్థులనే కోర్టు జప్తు చేసుకుని జరిమానాను జమచేసుకుంటుంది. అసలు జయలలిత పేరుతో ఉన్న స్వంత ఆస్థులు, బినామీలపై ఉన్న ఆస్థులెన్ని అన్నది ముందు తేలాల్సిన అంశం. వారసుల విషయంలో ఇప్పటికే జయ మేనకోడలు దీప గొంతెత్తు తున్నది. ఆమెకు పన్నీర్‌సెల్వం మద్దతు కూడా ఉంది. అలాగే శశికళ ప్రస్తుతం జైల్లో ఉండటంతో ఆమె బంధువులు కూడా జయ వారసులుగా వెలుగులోకి వస్తు న్నారు. ఆమె ద్వారా వచ్చిన ఆస్థి పాస్తులను, పదవులను అనుభవించే వారే ఆమె జరిమానాను కూడా చెల్లించాల్సి ఉంటుంది.

**ప్రశ్న : తెలంగాణాలో ఈనెల 22న జెఎసి ఆధ్వర్యంలో నిరుద్యోగ ర్యాలీ ని తలపెట్టారు. ఇదెంత వరకు సరైనది. తెలంగాణ వచ్చాక అసలు ఉద్యోగాలే రాలేదా....**

జవాబు : ఉద్యోగాలు అసలే ఇవ్వలేదని జెఎసి అనడం లేదు. అయితే ఇవ్వాల్సినన్ని ఇవ్వలేదన్నది జెఎసి వాదన తెలంగాణ ఉద్యమమే నీళ్ళు, నిధులు, నియామకాలకు సంబంధిం చింది. అందులో నిధులైతే తెలంగాణవి తెలంగాణకే దక్కుతు న్నాయి కానీ నీళ్ళ విషయంలోను, నియామకాల విషయం లోను కొంత గందరగోళం నెలకొన్నది. నీళ్ళ విషయంలో పక్కరాష్ట్రంతోని తేల్చుకోవాల్సి ఉంది కాబట్టి దీనిపై ప్రజలు అంతగా ఆలోచించడం లేదు. ఇక నియామకాల విషయానికి వస్తే ఇది పూర్తిగా రాష్ట్ర ప్రభుత్వమే చేయాల్సింది కాబట్టి జెఎసి ప్రభుత్వాన్ని నిలదీస్తున్నది. నిరుద్యోగులలో ప్రభుత్వం పై ఉన్న అసంతృప్తిని కోదండరాం తనకు అనుకూలంగా మార్చుకుంటున్నారు. ప్రభుత్వం లక్ష ఉద్యోగాలిస్తామని హామీ ఇచ్చినా కూడా పది వేలకు మించి ఇవ్వలేదన్నది ఆయన ఆరోపణ అందుకే ఆయన ఉద్యోగాల పేరుతో నిరుద్యోగ ర్యాలీ జరుపుతున్నారు. దీనికి నిరుద్యోగుల నుంచి ఆదరణ లభిస్తున్నది.

అయితే ఇలా అని ప్రభుత్వం అసలేమీ చేయలేదనడం కూడా సరికాదు. టిఎస్‌పిసి ద్వారా నియామకాలకు ప్రభు త్వం కసరత్తు చేస్తూనే ఉంది. అయితే అనుకున్నంత వేగంగా జరగడం లేదు. ఎస్.ఐ, కానిస్టేబుల్ ఉద్యోగాల కోసం పరీ క్షలు పూర్తయి ఏడాదయినా ఫలితాలు రావడం లేదు. టీచర్ ఉద్యోగాల భర్తీ వెనుకబడి పోయింది.

ఇలా చెప్పుకుంటూ పోతే చాలా స్థాయిల్లో ఉద్యోగాల భర్తీ విషయంలో ప్రభుత్వం చురుగ్గా ముందుకు పోవడం లేద న్నది స్పష్ట మవుతుంది. అందుకే జెఎసి ఇచ్చిన పిలుపుకు నిరుద్యోగుల నుంచి మంచి స్పందన లభిస్తుంది.

**ప్ర: నోట్ల రద్దుతో ముందు ముందు ప్రయోజనాలు ఎన్ని ఉన్నా...ప్రస్తుతం మాత్రం ఎక్కువగా అతివలు కష్టాలపాలవు తున్నారు. ఢిల్లీ పెద్దలకు ఇవన్నీ చిన్న విషయాలు...దానికి తోడు చంద్రబాబులాంటి బాధ్యతాయుత నేతలు కూడా పెద్దనో ట్లను తానే రద్దుచేయించినట్లు గొప్పగా చెప్పుకుంటున్నా రు...నగదు రహిత లావాదేవీలకు రమ్మని చాలా ఈజీగా సూ చనలు ఇస్తున్నారు...ఇవన్నీ అమలులో సాధ్యమయ్యేవేనా?**

**-ఎన్.గోపీకిషన్, సురారం**

జ: బాధ్యతాయుతమైన స్థానాల్లో ఉండే పెద్దలు ఆచి తూచి మాట్లాడాలంటారు. లేకపోతే అభాసుపాలవుతారు. మోడీ ప్రభుత్వం పెద్ద నోట్లను రద్దు చేసిన వెంటనే ఎపి సిఎం చంద్రబాబు స్వాగతించారు. పెద్దనోట్లను రద్దు చేయాలని తానెప్పుడో మోడీకి లేఖ రాసినట్లు ఆయన గొప్ప కబుర్లు చెప్పారు. నోట్లరద్దుతో చంద్రబాబు అనేక సార్లు మాటలు మార్చారు. ప్రజలు ఇక్కట్లు పడుతున్నారన్నారు. రెండు వేల రూపాయల నోట్లనూ రద్దు చేయాలన్నారు. నగదును సరిగా పంపిణీ చేయడం లేదంటూ బ్యాంకు ఉద్యోగులపై మండి పడ్డారు. కరెన్సీ కష్టాలపై ప్రతిరోజూ సమీక్షలు చేస్తూ సల హాలు ఇస్తున్నారు. చివరకు ఆయన ఏమి ఏమి మాట్లాడు తున్నారో తెలియడం లేదని అధికారులు అయోమ యంలో పడుతున్నారు. బ్యాంకర్లపై చంద్రబాబు చేసిన వ్యా ఖ్యలపై బ్యాంకు ఉద్యోగుల సంఘాలు నిరసన వ్యక్తం చేస్తున్నాయి.

**నూకారపు సూర్యప్రకాశరావు**
చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**మెయిల్ అడ్రస్**
SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

## లెజెండ్

# ఆస్కార్ వైల్డ్

'ఆస్కార్ వైల్డ్' (అక్టోబర్ 16, 1854 నవంబర్ 30, 1900) ఐర్లండుకు చెందిన ఒక నాటక రచయిత, నవలా రచయిత, కవి మరియు కథా రచయిత. ఆయన రచనల్లోని చతురత పాఠకులను ఇట్టే ఆకట్టుకుంటుంది. లండన్‌ను విక్టోరియా రాణి పరిపాలించే కాలంలో ఆయన ప్రముఖ రచయితల్లో ఒకడిగానే కాక ఆయన సమకాలికుల్లో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నాడు. ఆయన సమాజానికి ఇచ్చిన సందేశాత్మక సూక్తులు ఎంతో ఆచరణీయం...అనిర్వచనీయం...



ఆస్కార్ వైల్డ్ డబ్లిన్ లోని 21, వెస్ట్‌లాండ్ రో అనే ప్రదేశంలో జన్మిం చాడు. ఒక ఆంగ్లో-ఐరిష్ కుటుంబంలో ఆయన రెండో సంతానంగా జన్మించాడు. ఆయన తల్లిదండ్రులు సర్ విలియం వైల్డ్, జేన్ ఫ్రాంకెస్కా వైల్డ్. జేన్ ఒక మంచి రచయిత్రి మాత్రమే కాకుండా యంగ్ ఐర్లాండర్స్ అనే ఒక విప్లవ సంస్థకు కవయిత్రిగా కూడా పనిచేసేది. జీవితాంతం ఐరిష్ జాతీయురాలుగానే గడిపింది. సర్ విలియం ఐర్లాండ్ లోనే పేరొందిన కన్ను మరియు చెవి వ్యాధుల స్పెషలిస్టు. 1864 లో వైద్య రంగానికి ఆయన చేసిన సేవలకు గాను బ్రిటిష్ ప్రభుత్వం సర్ బిరుదునిచ్చి సత్కరించింది. ఆయన పురావస్తు శాస్త్రం మీద మరియు జానపదుల మీద కూడా కొన్ని పుస్తకాలు రాశాడు. పేరొందిన వితరణశీలి. ట్రినిటీ కాలేజ్ డబ్లిన్ కు వెనుక ఉన్న లింకన్ ప్లేస్ అనే ప్రదేశంలో ఉన్న డిస్పెన్సరీలో ఆయన నగరంలోని పేదప్రజలకు ఉచితంగా వైద్యం చేసేవాడు.

మంచి సమాజంలోకి మనం వెళ్ళాలంటే వాళ్లకు పెట్టాలి, ఆనందింప చెయ్యాలి, లేకుంటే దిగ్భ్రాంతికి గురి చెయ్యాలి అనేవాడు ఎప్పుడూ ఆస్కార్ వైల్డ్.

### ఆస్కార్ వైల్డ్ కొటేషన్లు

నిజంగా నువ్వు ప్రేమించాలని వుంటే అది నీ కోసం కాచుకొని వుంటుంది.

ప్రతి మనిషి దేన్నయితే ప్రేమిస్తాడో దాన్నే చంపుతాడు.

రూపాన్ని బట్టి తీర్పు చెప్పలేని వాళ్ళు వివేచానపరులు కాదు.

ఎల్లుండి చేయదగ్గ పని రేపటి వరకు కూడా ఆపను.

ఖచ్చితమైన వ్యక్తిత్వమంటే ఎదిరించడం కాదు, శాంతి.

విద్యాభ్యాసం గౌరవనీయమే కాని ఎల్లప్పుడూ ఒకటి గుర్తుంచుకోవాలి. ఉపయోగకరమైనదేదీ అక్కడ బోధించరని.

ఓ మానసిక రోగికి ప్రతి వస్తువు వెల తెలుసు కానీ ఏ వస్తువు విలువ తెలియదు.

పిల్లల్ని మంచివాళ్ళుగా తీర్చిదిద్దాలంటే వాళ్లను సంతోషపెట్టడమే.

గతించిన రోజుల్ని కొనేంత ధనవంతుడు లేడు.

ఒక్కోసారి నేను అనుకుంటాను దేవుడు మనిషిని సృష్టించడంలో తన శక్తిని ఎక్కువగా అంచనా వేసుకున్నాడు.

పురుషుడు నీతిగా ఉండటం కపటత్వం. స్త్రీ నీతిగా ఉండటం సహజం.

అతన్ని గురించి అతను ఆలోచించడం స్వార్ధం కాదు. అతన్ని గురించి అతడు ఆలోచించనివాడు ఆలోచించలేనేలేడు.

ఉదయం లేవగానే నిన్న చేసిన తప్పును గుర్తు చేసుకో.ఆ తప్పు ఇక వునరావృతం కాదు.

తన తప్పుకు ప్రతివాడు పెట్టుకొనే అందమైన పేరు అనుభవం.

వాదనలు నిష్ప్రయోజనమైనవి. వాటికీ దూరంగా ఉండండి.

మంచిగా వుండటం కన్నా, అందంగా ఉండటం మంచిది.

అనాగరికంగా ఉండే కన్నా మంచిగా ఉండటం మంచిది.

మనలో ఏదో కోల్పోయాం,అదే ఆశ.

చరిత్రంతా భావనల యుద్ధక్షేత్రమే.

గొప్ప ఆలోచనలన్నీ ప్రమాదభరితమైనవే.

ఓ భావన విలువ అది వ్యక్తం చేసిన మనిషి స్వచ్ఛతను బట్టి ఉంటుంది.

ఆవేశం మనిషిని తప్పుదారి పట్టిస్తుంది.

అతి చెడ్డపని కూడా మంచి ఉద్దేశ్యంతోనే మొదలవుతుంది.

మంచికి ఆనందపు ముగింపు, చెడుకి బాధాకర ముగింపు అదే కథకు సరైన ముగింపు.

ద్వైదీభావంగా జీవించకు, చెడ్డవాడిగా కనిపిస్తూ అన్నివేళలా మంచి పనులే చేయకు,అదే కపటమంటే.

జాతీయత కల్పన యొక్క కోరిక.

ప్రేమలో పడటం గొప్ప కల్పన.

కల్పన యొక్క దారుణమేమంటే మన కలల్ని బలహీనం చేస్తుంది.

కవి దేనికైనా తట్టుకుంటాడుగాని, పొరబాటు ముద్రణకు తట్టుకోలేడు.

ఓ కవితను పరిహసించడం రెండు రకాలు ఒకటి పరిహసించడం రెండు పోప్ చదవడం.

ఏ కళాకారుడు దేన్నీ వున్నది వున్నట్లు చూడడు. అలా చూసేవాడు కళాకారుడే కాదు.

కళలన్నీ నిరుపయోగమైనవి.

ఎర్ర గులాబి స్వార్ధపూరితం కాదు.

చరిత్ర సృష్టించడం తేలిక,రచనే కష్టం.

జనాలను నీ నుండి దూరం చేసుకోవడానికి త్వరితమైన మార్గం నీ మీద నువ్వే జాలిపడటమే.

ఓ పుస్తకంగాని ఓ కవితగాని జాలి లేకుండా వ్రాయడం కంటే వ్రాయకపోవడం మిన్న.

ప్రశ్నేలేదు! జీవించడం అన్నింటికంటే ఓ గొప్ప కళ.

చెడ్డగా జీవించే చక్కటి మరణం కంటే తేలిక విషయాలు వున్నాయి.

కళ జీవితాన్ని అనుసరించే కంటే జీవితమే కళను అనుకరిస్తుంది.

పురుషుడు జీవితాన్ని ముందుగా తెలుసుకుంటే స్త్రీ చాలా ఆలస్యంగా తెలుసుకుంటుంది.

నేటి రోజుల్లో ప్రతి గొప్పవాడికి అనుచరులుంటారు. ఎల్లప్పుడూ వాళ్ళ జీవితచరిత్రలు వ్రాస్తారు.



శిశువు హాయిగా నిద్రించే ఉయ్యాల, మృతుడు శాశ్వతంగా నిద్రించే సమాధి, ఈ రెంటిపైనా మెరిసే తార మానవుడి ఆశ. -అరవింద యోగి

## మినీ కవిత

ఆకాశవనంలో కాసేపు విహరిస్తున్నా
నక్షత్ర క్షేత్రంలో ధృవతారలా నిలుచున్నా
నిన్ను చేరుకోలేక, నిజం జీర్ణించుకోలేక
నీ అనురాగార్థుడిగా ఈ దనుజ లోకంలో
మిగిలిన నేను నీ ప్రేమకు అవశేషం....

## ఉద్యోగులకు 7 సూత్రాలు

1. బాస్ దగ్గరకి వస్తే, బిజీగా పనిచేస్తున్నట్లు నటించు
2. ఆయన మాట్లాడితే శ్రద్ధగా వింటున్నట్లు నటించు
3. బాస్ చేతి రాత కాగితం వస్తే టైప్ చెయ్యి
4. ఫ్రెండ్ వస్తే సీట్లోంచి లేచి అతనితో కేంటీన్‌కు వెళ్లు
5. పని ఒత్తిడి ఎక్కువైతే కంప్యూటర్ పాడైందని చెప్పు
6. మర్నాడు సెలవు రోజైతే ఈ రోజు పనిచెయ్యక హాలిడే మూడ్‌లో ఉండు
7. జీతం వచ్చే రోజు ఎట్టి పరిస్థితుల్లోనూ డుమ్మా కొట్టకు.

## అమాయకుడు

**ప్రేయసి :** తప్పు చేసినపుడు ఒప్పుకున్నవాడు....
**ప్రేమికుడు :** నిజాయితీపరుడు అనిపించుకుంటాడు
**ప్రేయసి :** చేసిన తప్పును సరిదిద్దుకునేవాడు
**ప్రేమికుడు :** తెలివైనవాడు అనిపించుకుంటాడు
**ప్రేయసి :** చివరిగా...తప్పుచేయకపోయినా తప్పు చేసినట్లు ఒప్పుకునేవాడు...
**ప్రేమికుడు :** పెళ్లయిన భర్త అనిపించుకుంటాడు

## రన్నింగ్ వాయిస్

### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షికలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.




### వింతలు విశేషాలు

ఈ వారం వింతలు విశేషాలు ఎంత గానో బాగున్నాయి.వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–వెంకట్, గొల్లపూడి

## 'కూని'రాగాలు

పరువంటే పలుకుబడి కానేకాదు..!
గెలుపంటే నీ ప్రయోజనం కాకూడదు..!!

అధికారం వలన బాధ్యత పెరగాలి..!
మమకారంతో బంధం పెనవేయాలి..!!

గర్వం పతనానికి నాంది కావచ్చు..!
ధైర్యం గెలుపుకు మలుపు ఇవ్వచ్చు..!!

కూరిమి లేమిలో దీపం అవుతుంది..!
ఓరిమి సమస్య తీరే దారి చూపుతుంది..!!

మానవత్వం మనుగడలో ప్రధమస్థానం..!
హింసాత్మకం ఆచరణకు అధమస్థానం..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

### ఆ మాత్రం తెలియదా?

'ఉప్మాలో ఇంత పొడవైన వెంట్రుక వచ్చింది . అంటే దీనర్థం ఏంటయ్యా?' కోపంగా అడిగాడు అప్పారావ్.
'ఆ మాత్రం తెలియకపోతే ఎలా సార్..అది ఆడవాళ్లు చేసిన ఉప్మా' తాపీగా బదులిచ్చాడు సర్వర్

### ధర తగ్గనీ..!

పార్కులో ఇద్దరు ప్రేమికులు మాట్లాడుకుంటున్నారు.
'ఇంతకీ నా మెడలో తాళి ఎప్పుడు కడతావ్?' అడిగింది ప్రియురాలు
'బంగారం ధర కాస్త తగ్గాక ఆలోచిద్దాం' చెప్పాడు ప్రియుడు.

### సైలెన్స్...!

'పెళ్లి చూపుల్లో అతనడిగిన ప్రశ్నకు నువ్వేం సమాధానం చెప్పలేదు కదా..! మరి నువ్వెలాగ నచ్చావ్?' ఆశ్చర్యంగా అడిగిందిరాధిక
' అతడు లైబ్రేరియన్' సిగ్గుతో చెప్పింది విమల.

### నిర్దోషి..

'నువ్వు రెండు పెళ్లిల్లు చేసుకున్నావని రుజువు కాలేదు. కాబట్టి నిన్ను నిర్దోషిగా విడుదల చేస్తున్నాను. నువ్వు ఇంటికెళ్లొచ్చు' జడ్జి తీర్పిచ్చాడు.
' ఆ ఇద్దరు ఇళ్లలో ఎవరింటికెళ్లాలి' అని అసహనంగా అడిగాడు ముద్దాయి

ఫన్చ్ నారు










జ్ఞానం, విజ్ఞానం సంపాదించుకోవాలని అందూ అభిలషించేవారే. అయితే వాటికి మూల్యం చెల్లించడానికి ఇష్టపడేవారెవ్వరూ లేరు. -జువెనల్




**Movie** : Godfather part 11
**Director** : Francis Ford Coppola

**Producer** : Francis Ford Coppola
**Screenplay** : Francis Ford Coppola
**Starring** : Al Pacino, Robert Duvall
Diane Keaton, Robert De Niro, Talia Shire,
Morgana King, John Cazale, Marianna Hill
Lee Strasberg
**Music** : Nino Rota
**Cinematography** : Gordon Willis
**Editing** : Peter Zinner, Barry Malkin
Richard Marks
**Production company** : Coppola Company
**Distributed by** : Paramount Pictures
**Release dates** : December 12, 1974 (New York City)
December 20, 1974 (United States)
**Running time** : 200 minutes[1]
**Country** : United States
**Language** : English, Sicilian




# ది గాడ్ ఫాదర్ - 2

ఏదైనా కథకి తరువాతి భాగం చెబితే.... దాన్ని సీక్వెల్ అంటాం! అదే జరిగిన కథకి ముందేం జరిగిందో చెబితే... అది ప్రీక్వెల్ అవుతుంది! కాని, 1972 నాటి గాడ్ పాదర్ కి గాడ్ ఫాదర్ 2 సీక్వెల్ అండ్ ప్రీక్వెల్ రెండూ అయింది! అదెలా? ఈ ప్రశ్నకి సమాధానం... ఈ క్లాసిక్ మూవీ స్క్రీన్ ప్లేనే! ఫస్ట్ పార్ట్ ఆఫ్ గాడ్ ఫాదర్ లో విటో కొర్లియానే డాన్ గా కనిపిస్తాడు మనకు. అయితే, సినిమా ఎండింగ్ కల్లా ఆయన కొడుకు మైఖెల్ కొర్లియానే డాన్ అవుతాడు. ఈ ఇద్దరి జీవితాల్నీ ది గాడ్ఫాదర్ 2 సైమల్టేనియస్‌గా చూపిస్తుంది! ఒక వైపు ఇటలీ నుంచి చిన్న పిల్లోడిగా న్యూ యార్క్ నేలపై కాలుమోపిన విటో కొర్లియానేని చూపిస్తూనే.. మరో వైపు అమెరికాని శాసిస్తోన్న అతడి కొడుకు డాన్ మైఖెల్ కొర్లియానేను చూపుతుంది...

ది గాడ్ ఫాదర్ 2 మూవీ 1974లో విడుదలైంది. అయితే, అంతకు రెండేళ్ల ముందు రిలీజ్ అయిన గాడ్ ఫాదర్ కన్నా.. ఈ సెకండ్ ఇన్‌స్టాల్మెంట్ మరింత ఎక్కువ ప్రశంసలు పొందటం విశేషం! ఏకంగా పదకొండు అకాడమీ అవార్డ్సుకి నామినేటై ఆరు గెలుచుకుంది. పైగా ఆస్కార్ గెలుచుకున్న తొలి సీక్వెల్ మూవీ కూడా ఇదే! బెస్ట్ డైరెక్టర్‌గా కొప్పొలా , బెస్ట్ యాక్టర్‌గా రాబర్ట్ డీ నిరో, బెస్ట్ స్క్రీన్ ప్లే కోసం కొప్పొలా, పూజో అవార్డులు అందుకున్నారు. మైఖెల్ కొర్లియానేగా ఈ పార్ట్ లో కూడా కొనసాగిన అల్ పాసినో ఉత్తమ నటుడిగా బాఫ్టా అవార్డ్ పొందాడు.

**మైలురాయిగా మిగిలింది:**

గాడ్ ఫాదర్ లాగే గాడ్ ఫాదర్ 2 కూడా అమెరికన్ సినీ చరిత్రలో మైలురాయిగా మిగిలిపోయింది. ప్రపంచ సినిమాని ఈ రెండు చిత్రాలు చెప్పలేనంతగా ప్రభావితం చేశాయి. 1997లో, అమెరికన్ ఫిల్మ్ ఇన్ స్టిట్యూట్, గాడ్ ఫాదర్ 2ని.... అమెరికన్ సినీ చరిత్రలోనే 32వ అతి గొప్ప చిత్రంగా ప్రకటించింది. అయితే, గాడ్ ఫాదర్, గాడ్ ఫాదర్ 2కి సీక్వెల్ గా 1990లో గాడ్ ఫాదర్ 3 వచ్చింది. కాని, అది ముందటి భాగాల్లా అలరించలేదు. మిక్స్‌డ్ రివ్యూస్ మూటగట్టు కుని బాక్సాఫీస్ వద్ద సంచలనాలు సృష్టిం చలేకపోయింది.గాడ్ ఫాదర్ 2 సినిమా మనకు అర్థం కావాలంటే గాడ్ ఫాదర్ ఫస్ట్ పార్ట్ తో పరిచయం వుండాలి. 1974లో విడుదలైనప్పుడు... అంతకు జస్ట్ టూ ఇయర్స్ ముందు గాడ్ ఫాదర్ వచ్చింది కాబట్టి జనం ఈజీగా ఫాలో అయిపోయారు. అయితే, ఈ తరం వారు కూడా... దాదాపుగా చాలా మంది మొదటి భాగం చూసిన వారే! గాడ్ ఫాదర్ అంతటి క్లాసిక్ మూవీ.... ఇక దానికి సీక్వెల్ గా వచ్చిన గాడ్ ఫాదర్ 2 కూడా అలాగే వుంటుంది. అయితే, ఈ సినిమా ఏక కాలంలో వెనక్కి , ముందుకి సాగుతూ ఒకింత క్లిష్టంగా వుంటుంది.

**రెండో పార్ట్ చాలా డిఫరెంట్:**

గాడ్ ఫాదర్ వన్ తో పోలిస్తే... గాడ్ ఫాదర్ 2 చాలా విషయాల్లో డిఫరెంట్ గా వుంటుంది. మొదటి భాగంలో మొత్తం మాఫియా ప్రపంచం చుట్టూ కథ తిరిగుతుంది. అక్కడి అమానుష పరిస్థితులు చూపిస్తాడు డైరెక్టర్. కాని, గాడ్ ఫాదర్ 2లో ఒకప్పటి ఇటాలియన్ వలస జనాల బతుకులు కనిపిస్తాయి. దేశం కాని దేశంలో వాళ్లు ఎంత దయనీయంగా వుండే వారో తెలుస్తుంది. అలాంటి అనివార్య స్థితిలోంచే విటో కొర్లియానే డాన్‌గా ఎదుగుతాడు. మరో వైపు ప్రస్తుత డాన్ మైఖెల్ కొర్లియానే, మారిన కాలానికి అనుగుణంగా దేశదేశాలు తిరుగుతూ వ్యాపారం విస్తరిస్తూ... పొలిటీషన్స్ మొదలు స్వంత అన్న వరకూ ఎవ్వర్నైనా అడ్డు తొలిగించుకుంటూ ముందుకు పోతుంటాడు....

తొమ్మిదేళ్ల వయస్సులో న్యూయార్క్‌లో అడుగుపెట్టిన విటో కొర్లియానే పెళ్లి చేసుకుని ముగ్గురు కొడుకుల తండ్రి అవుతాడు. అయితే, అతను తన ఇద్దరు మిత్రులతో కలిసి చేస్తోన్న ఖరీదైన దొంగతనాలు లోకల్ డాన్ ఫనూసీకి తెలుస్తాయి. అతను తన వాటా ఇవ్వకపోతే పోలీసులకి చెబుతానని బ్లాక్ మెయిల్ చేస్తాడు. విటో కొర్లియానే మిత్రులిద్దరూ మామూలు ఇచ్చేందుకు సిద్ధపడతారు. కాని, విటో వాళ్లతో ఫనూసీకి తానొక కాదనలేని ఆఫర్ ఇవ్వబోతున్నాని చెబుతాడు! ఆ రెఫ్యూజ్ చేయలేని ఆఫర్... ఫనూసీని చంపటం... విటో కొర్లియానే లోకల్ డాన్ ని చంపేయటం అతడి స్థాయిని పెంచేస్తుంది! ఓ భర్తలేని ఒం టరి స్త్రీ అదే సమయంలో నానా ఇబ్బందులు పడుతుంటుంది. ఆమెని ఇంటి ఓనర్ ఖాళీ చేయమని చెప్పేస్తాడు. కనీసం ఇష్టంగా పెంచుకున్న కుక్కని కూడా తీసుకో వద్దని హెచ్చరిస్తాడు. ఆమెకి అండగా నిలుస్తాడు విటో కొర్లియానే. అయితే, అతనెవరో మొదట అర్థం కాని ఇంటి ఓనర్ పెద్దగా పట్టించుకోడు. కాని, లోకల్ డాన్ ఫనూసీని చంపాడని తెలిశాక... కాళ్ల బేరానికి వస్తాడు. అప్పటి దాకా వద్దన్న స్త్రీని ఇంట్లో వుండమనటమే కాక కుక్కని అప్పగించి.... రెంట్ కూడా తగ్గిస్తాడు.

ఆడియన్స్‌ని ప్రస్తుతంలోకి తీసుకొచ్చిన డైరెక్టర్... మరో సారి మైఖెల్ కొర్లియానే వ్యవహారాన్ని చూపిస్తాడు. మెల్ల మెల్లగా మైఖెల్ మనసులో వున్న అనుమానాలు సమసి పోతుంటాయి. రాత్ అనే గ్యాంగ్ స్టర్ చేసిన కుట్రలో తన అన్న ఫ్రెడో కూడా పాలుపంచుకున్నాడనీ, తనపై హత్య యత్నానికి కారణమయ్యాడని నిర్ధారించుకుంటాడు. అయితే, తన తల్లి బతికి వున్నంత కాలం ఫ్రెడోని ఏం చేయవద్దని తన వాళ్లతో చెబుతాడు. అటు భార్యతో కూడా మైఖెల్ సఖ్యత తీవ్రంగా దెబ్బతింటుంది. రోజురోజుకి మైక్ మాఫియా నేర ప్రపంచంలో మునిగిపోతుండటంతో ఆమె గొడవ పడి బయటకి వెళ్లిపోవాలని నిర్ణయించుకుం టుంది. న్యూయార్క్‌లో మంచి వాడుగానే కాక డేంజరస్ మ్యాన్‌గా పేరు తెచ్చుకున్న విటో కొర్లియానే చాలా ఏళ్ల తరువాత స్వదేశమైన ఇటలీ వెళతాడు. అక్కడ ఒకప్పుడు తన కుటుంబాన్ని నాశనం చేసిన డాన్ ని అనూహ్యాంగా చంపేస్తాడు!

మాఫియా ప్రపంచంలో కాలుపెట్టడం అంటే పులి వీపు మీద కూర్చోవటమే! ఆ విషయం విటో, మైఖెల్ కొర్లియా నేల విషయంలో కూడా నిజమే అయింది! ఒక్కసారి రక్తంతో తడిసిన వ్యాపారాలకి వాళ్లు అలవాటు పడ్డాక చేతులు కడుక్కోవటం ఇద్దరికీ కుదరలేదు. అయితే, కొర్లియానే ఫ్యామిలీకి మూలమైన విటో కొర్లియానే జీవి తాంతం మంచి వాడుగా వుంటూనే మాఫియా డాన్‌గా కొనసాగాడు! మైఖెల్ మాత్రం ఎప్పటికప్పుడు తన చట్ట వ్యతిరేక వ్యాపారాల్ని చట్ట బద్ధం చేసు కునే ప్రయత్నం చేస్తూ వచ్చాడు. ఆ క్రమంలో మాఫియా అనే పులిపై నుంచి కిందకు దిగలేక పోయాడు. పైగా మరిన్ని మర్డర్స్ కు పూనుకోవాల్సి వచ్చింది. తనని తన స్వంత అన్న ఆసరాతోనే అంతం చేయాలని చూసిన రాత్ ను మైక్ చివరకు చంపిం చేస్తాడు. రోకో అనే తన మనిషి చేత ఈ పని చేయిస్తాడు. అలాగే, శత్రు శేషం వుండకూడ దని ఫ్రాంక్ అనే ఒకప్పటి తన ముఖ్య సలహాదారుని కూడా అంతం చేయిస్తాడు. బాత్ టబ్‌లో చచ్చిపడి కనిపి స్తాడు అతను. ఇక మైఖెల్ అన్న ఫ్రెడోని అతని ముఖ్య అనుచరుడు అల్ నేరి కాల్చి చంపేస్తాడు..... మరో సారి దారుణమైన రక్త పాతం తరువాత మైఖెల్ కొర్లియానే నేర సామ్రాజ్యంపై పట్టు సాధిస్తాడు!




మరోసారి గతంలోకి తీసుకెళ్లిన డైరెక్టర్ విటో కొర్లియానే యాభయ్యవ బర్త్ డే సందర్భంగా పార్టీ జరగ టం చూపిస్తాడు. డైనింగ్ టేబుల్ వద్ద కేక్‌తో సహా అంతా సిద్ధంగా వుంటుంది. ■



www.facebook.com
jaisimha.chaturved
jaisimhachaturvedi@g
mail.com



తనకి తాను యజమాని కాలేని మనిషి ఎన్నటికీ స్వతంత్రుడు కాలేడు - ఎపిక్టిలస్



కొన్ని పిలుపులు కొందరి జీవితాల్లో మలుపు తిప్పుతాయంటారు. ఆ మలుపులే వారి అభ్యున్నతికి సోపానాలవుతాయి. అలా చేరిన చాలా మంది చరిత్ర పుటల్లో నిలిచిపోతారు. ఆ కోవకు చెందిన వారే గూడవల్లి రామ బ్రహ్మం. జాతీయ వాదిగా, వ్యాపార వేత్తగా, స్వాతంత్ర్య సమరయోధునిగా, కళాకారునిగా, నిర్మాతగా, దర్శకునిగా, అభ్యుదయ వాదిగా, నిర్మాతగా, దర్శకునిగా అష్ట లక్షణాలను మూర్తీభవించిన ధీశాలి రామబ్రహ్మం.




# అభ్యుదయ పథం గూడవల్లి రామబ్రహ్మం






నమ్మినదాన్ని త్రికరణ శుద్ధితో ఆచరించటం, అమలు చేయటానికి అహర్నిశలూ శ్రమిం చటం ఆయనలోని ప్రత్యేక లక్షణాలు. సమాజపు బెదిరింపులను, రాజకీయ ఒత్తిడులను లక్ష్యపెట్టని సాహసి. ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నవారికి ఏ కొంచెం ఆసరా దొరికినా అభివృద్ధి పథంలో దూసుకుపోవటానికి అవకాశాలున్నాయని నిరూపించిన వారు రామబ్రహ్మం. ఒకే ఒక రూపాయితో మద్రాసు చేరి, అంచెలంచెలుగా ఎదిగిన రామబ్రహ్మం జీవితం వడ్డించిన విస్తరి కాదు. అనేక ఇబ్బందులు పడ్డారు. ఇక్కట్లకు గురయ్యారు. సమాజం చేత ఛీత్కారాలు అందుకొన్నారు. కష్టాలకు ఎదురొడ్డి నిలిచారు. ప్రతి ఆంధ్రుడు మా రామ బ్రహ్మం అని గర్వంగా చెప్పుకోగల చరిత్రను సృష్టించుకొన్నారు.

రామబ్రహ్మం 1902 జూన్ 24 వ తేదీన జన్మించారు. బాపమ్మ, వెంకయ్యలు వారి జననీ, జనకులు. కృష్ణా జిల్లా, గన్నవరం తాలూకా నందమూరు వారి జన్మ స్థలం. (కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ జన్మ స్థలం కూడా నంద మూరే) నందమూరు కుగ్రామం. ప్రాథమిక విద్యనభ్యసించే అవకాశం కూడా ఆ గ్రామంలో లేదు. అందుబాటులో ఉన్న ఇందుపల్లి గ్రామంలో ప్రాథమిక విద్య పూర్తిచేసి ప్రాథమికోన్నత విద్య గుడివాడలో కొనసాగించారు. ఇంటర్మీడియట్ మచిలీపట్నంలోని నోబుల్ కళాశాలలో 1918లో పూర్తి చేశారు. అప్పటకే ఆయనలో స్వతంత్రభావాలు తలెత్తాయి. స్వాతంత్ర్య సముపార్జన విషయం ఆయనలో గట్టిగా నాటుకుపోయింది. చదువును కొనసాగించే అవకాశం లేకుండా ఈ భావాలు అడ్డుపడ్డాయి. చదువుకు స్వస్తి పలికి సహాయ నిరాకర ణోద్యమంలో పాల్గొన్నారు. కళ్యాణం వచ్చినా, కక్కువచ్చినా ఆగదంటారు. రామబ్రహ్మం కళ్యాణం కూడా తీసుకొచ్చింది. ఇందుపల్లి వాస్తవ్యులైన కోగంటి నాగయ్య కుమార్తె శారదాంబతో 1020లో వివాహం జరిగింది. అప్పటికి ఆయన వయస్సు 18 ఏళ్లు మాత్రమే. అప్పటికే స్వతంత్ర భావాలు మెండుగా ఉన్న రామబ్రహ్మం అత్తగారింటిలోని విదేశీ వస్త్రాలను చూసి మండి పడ్డారు. ముందు వెనుకలు ఆలోచించకుండా ఆ విదేశీ వస్త్రాలను తగులబెట్టారు.

మహాత్మాగాంధీ పిలువు ఇచ్చిన సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. ఇటు సంసారాన్ని, అటు సహాయ నిరాకరణోద్యమాన్ని సమ దృష్టితో చూశారు. స్వాతంత్రోద్యమం ప్రధాన ఆశయమైనా కుటుంబాన్ని పోషించటం తక్షణ కర్తవ్యం.

మనిషి మనిషిగా జీవించాలంటే ఏదో విధంగా సంపాదన అవసరం. అందుకోసం 1926లో విజయవాడలో ఫ్రెండ్స్ అండ్‌కో పేరుతో ఒక పుస్తకాల దుకాణం తెరిచి వ్యాపారం ప్రారంభించారు. అక్కడ సాహితీ వేత్తలకు, కళాకారులకు నిలయమైంది. ఆ వ్యాపారం మూడు పూలు-ఆరు కాయలుగా విస్తరిస్తున్న సమయంలో అనుకోని అవాంతరం వచ్చిపడింది. స్వాతంత్ర్యోద్యమంలో చురుగ్గా పాల్గొంటున్న రామబ్రహ్మంపై బ్రిటిష్ అధికారుల కన్ను పడింది. అరెస్ట్ వారెంట్ కూడా జారీ చేసింది. అరెస్ట్ చేయడంతో పాటు ఆయన ఆస్తిని కూడా స్వాధీనం చేసుకోవచ్చనే వుకార్లు వెలువడ్డాయి. నిశితంగా పరిశీలిస్తే అవి వుకార్లు కావని, యదార్థాలని నిర్ధా రించుకున్న రామబ్రహ్మం షాపులో ఉన్న ముఖ్యమైన వస్తువులను మరొక చోటికి తరలించడం శ్రేయస్కరమని అభిప్రాయపడ్డారు. పగలు లేదా రాత్ర షాపులోని సామానులు తరలిస్తుంటే చాలా మందికి అనుమానం వస్తుంది. పోలీసుల వరకు ఆ విషయం వెడుతుంది.

అలా జరక్కుండా ఉండటం కోసం ఓ రాత్రిపూట, షాపు ముందు హరికథను ఏర్పాటు చేసి ప్రజానీకం దృష్టి ఆవైపు మళ్లించి, విలువైన వస్తువులను మరొక చోటుకు చేర్చే ఏర్పాటు చేశారు. హరికథ వింటున్న రామబ బ్రహ్మం మిత్రుడు తరలింపును పసిగట్టాడు. రామబ బ్రహ్మం సూచనతోనే తరలింపు జరుగుతుందన్న విషయం ఆ మిత్రుడికి తెలియదు. దొంగలు దోచుకుపోతున్నారనే ఉద్దేశ్యంతో వారికి అడ్డుపడ్డాడు. అలా అడ్డుపడుతున్న మిత్రునికి మరికొందరు సహాయపడ్డారు. ఇరు వర్గాల మధ్య పెద్దగొడవ జరిగింది. సందట్లో సడేమియా అన్నట్లు కొందరు అల్లరి మూకలు ఈ గొడవను చక్కగా ఉపయోగించుకొన్నారు. షాపును లూటీ చేశారు. చిత్తు కాగితం లేకుండా దోచుకుపోయారు. స్వగ్రామం నుంచి రైలు దిగిన రామబ్రహ్మంకు రైల్వే స్టేషన్‌లోనే ఈవిషయం తెలిసింది. వారెంట్ ఉండటంతో ఏ క్షణంలోనైనా అరెస్ట్ చేసే అవకాశం ఉంది కాబట్టి తానిక విజయవాడలో ఉండటం శ్రేయస్కరం కాదని స్టేషన్‌లో ఆగి ఉన్న రైలెక్కారు. మనస్సు స్థిమితంగా లేనవుడు, జటిలమైన సమస్య ఎదురైనవుడు పెద్ద దుప్పటి తీసుకొని ముసుగుదన్ని పండుకోవటం ఆయన నైజం. ఆ ముసుగు నుంచి బైటకు వచ్చాడంటే ఆ సమస్యకు పరిష్కారం దొరికినట్టే. మద్రాసులో ముసుగుతీసి, జేబులు తడుముకుంటే ఆయన వద్ద ఉంది ఒక్క రూపాయి మాత్రమే. ఆ రూపాయితో మద్రాసులో జీవించటం ఎలా? ఏమి .......ఇచ్చే వారెవరు? ఇలాంటి ప్రశ్నలు మనసును తొలిచేస్తుంటే రోడ్డులో అడ్డదిడ్డంగా నడుస్తూ పోతూ, వాహనాలకు అడ్డుపడ్డారు.

ఆ సమయంలో తృటిలో ప్రమాదం తప్పి ఓ కారు ఆయన వద్ద సడన్ బ్రేకులు వేసి ఆగింది. కొందరి దృష్టిలో అది మృత్యువాహనం అనిపిస్తుంది. కాని, రామబ్రహ్మంకు అదృష్టం మోసుకొచ్చిన అదృష్ట వాహనం ఆ కారు. అందులో నుంచి దిగిన ఓ పెద్ద మనిషి ఏయ్ రామబ్రహ్మం అంటూ పెద్దగా పిలిచాడు. ఆ పిలుపే ఆయన జీవితాన్ని మలుపు తిప్పుతుందని ఎవ్వరూ ఊహించి ఉండరు. కొత్త మలుపు తిప్పుతుందని కూడా అభిప్రాయపడలేరు. నెమ్మదిగా రామబ్రహ్మం వద్దకు వచ్చిన ఆ పెద్దాయన కమ్మ మహాసభలో పెద్ద లెక్చర్ దంచావు, కమ్మ వారికి చరిత్ర ఉంది. దాన్ని బయటకు తీసి, అచ్చువేయాలి అంటూ పెద్ద కోతలు కోశావు. ఆరోజు నుంచి మళ్లీ పత్తాలేవు ఏమిటి నీ కథ అంటూ మందలింపులో అనునయం కూడా చూపించాడాయన. తన పరిస్థితి ఆయనకు ఎలా చెప్పాలో అర్థం కాక సతమతమవుతూనే ఇక అంతా తీరికేనండి, వెంటనే ఆ పని మొదలు పెడతా అంటూ నసిగాడు రామబ్రహ్మం. ఆయన పరిస్థితిని గమనించిన పెద్దాయన ఇక నిన్ను వదలనుల అంటూ నవ్వి, ఆయన చేతుల్లో కొంత డబ్బు పెట్టి పుస్తకం పని పూర్తయ్యే వరకు మద్రాసు వదలకు అని ఆంక్షలు కూడా పెట్టారు. ...... మదరాసు రోడ్లపై తిరుగుతున్న రామబ్రహ్మంకు ఆసరా కల్పించిన మహనీయుడు జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి.

ఆయన వెళ్లాక చేబులో ఉన్న ఒకే ఒక రూపాయిని తీసి, ఆకాశంలోకి ఎగరేసి ఇక నుంచి ఈ రామస్వామి పరాధీనుడు అనుకొన్నాడు. మద్రాసు చేరిన రామబ బ్రహ్మం 1932 లో ప్రజామిత్ర సంపాదక బాధ్యతలు చేపట్టారు.





# సంఖ్యా శాస్త్రం

1) జ్యోతిష్య శాస్త్రము 2) సాముద్రిక శాస్త్రము 3) సంఖ్యా శాస్త్రము. ఏ శాస్త్రము అయినా మానవుడికి జరిగే సుఖ సంతోషాలు, కష్టసుఖాల గురించి సూచించే శాస్త్రములే ! భవిష్యత్తు గురించి తెలుసుకోవటానికి చేసే ప్రయత్నమే!

జ్యోతిష శాస్త్రము 27 నక్షత్రములు, 12 రాశుల యొక్క గణితము మీద ఆధారపడి చెప్పబడుతున్న శాస్త్రము.

సాముద్రిక శాస్త్రము – ఆ వ్యక్తి అరచేతిలో ఉన్న రేఖలను గమనించి ఆ రేఖల ప్రభావం వల్ల జరిగే విషయముల గురించి చెప్పు శాస్త్రము.

సంఖ్యా శాస్త్రము – ఇది సంఖ్య యొక్క ప్రభావం వల్ల ఆ వ్యక్తికి జరగబోయే విషయముల గురించి తెల్పుటకు ఉపయోగపడుతున్నది – ప్రతి మనిషికి ఏదో ఒక సంఖ్య యొక్క ప్రభావం ఉంటుది. ఆ ప్రభావం ఆ వ్యక్తి జీవితం పై చూపిస్తుంది. ఆ సంఖ్యలో పుట్టిన వారికి జరిగే సంఘటనలు ఆ వ్యక్తికి కూడా జరగవచ్చును. ఆ సంఖ్యకు చెందిన గుణగణములు అతనిలో వుండే అవకాశము ఉంది. ప్రతి మనిషికి ఏదో ఒక సంఖ్య యొక్క ప్రభావం ఉంటుంది. ఆ ప్రభావం అతని జీవితంలో ఉపయోగపడుతుంది.

మన పూర్వికులు, మహా ఋషులు, వారి తపో సంపద చేత, తమ దివ్యజ్ఞానము చేత చెప్పిన విధముగా జ్యోతిశశాస్త్రము మాదిరిగానే ఈ సంఖ్యా శాస్త్రము కూడా మన జీవితంలో ప్రయాణము చేయవలసిన మార్గములను గురించి, మన జీవితంలో జరగబోయే సుఖసంతోషాలను గురించి తెలుసు కొనుటకు ఉపయోగపడుతున్నది. ఈ సంఖ్యా శాస్త్రము మన దేశములోనే మన పూర్వీకులు మనకు అందించిన శాస్త్రమే ! మొదటి నుండి మనముందు వారు ఈ శాస్త్రమును తెలుసుకొని ఈ శాస్త్రమునకు ఎంతో ప్రాధాన్యతను ఇచ్చినారు. ఇతర దేశములలో కూడా అ సంఖ్యా శాస్త్రమును చాలా మంది నమ్ముతారు. ప్రపంచములోని దాదావు అన్ని దేశముల వారు అ సంఖ్యా శాస్త్రమును ఉపయోగించుకొని లాభపడుతున్నారు.

ఈ నెంబర్ల లేక ఈ సంఖ్యలకు సంభంధించిన శాస్త్రమునే న్యూమరాలజీ అంటున్నారు. చాలా కాలం నుండి, చాలా శతాబ్దాల నుండి ఈ అంకెలలో చాలా మహత్తు కలదు. ప్రతీ స్త్రీకి, ప్రతీ పురుషుడికి ఏదో ఒక నెంబర్ ప్రభావం తప్పని సరిగా ఉండి తీరుతుంది. ఏదో ఒక లక్కీ నంబర్ వ్యక్తి జీవితంలో అద్భుతమైన సంఘటనలు కలుగ చేస్తుంది.

సంఖ్యను లేదా నెంబర్‌ను ఉపయోగించుకొనుట వలన ప్రతీ వ్యక్తి తన పనులలో విజయములు పొందవచ్చును. ఇట్టి అంకెలకు గొప్ప శక్తి ఉంది. ఈ శక్తి వ్యక్తులకు ఉపయోగపడుతుంది. లాభం చేస్తుంది. అదృష్టం ప్రసాదిస్తుంది. గొప్ప గొప్ప విజయములను ప్రసాదిస్తుంది.

ఈ సంఖ్యా శాస్త్రము ఆధారంగా ఒక వ్యక్తి ఏ సంఖ్యకు చెందినవాడు, అతనికి ఏ తేదీలలో మంచి సంఘటనలు జరుగుతాయి. ఏ రంగు దుస్తులు ధరిస్తే అదృష్టం కలిసి వస్తుంది. అతని విద్య సాగుతుందా లేదా, ఎలాంటి వృత్తులు చేసుకొంటే బాగుంటుంది, వివాహ జీవితం ఎలా ఉంటుంది, ఉంగరములో ఏ రత్నమును ధరిస్తే లాభం పొందుతారు, ఏ సంఖ్యలో పుట్టిన వారితో స్నేహం చేయవచ్చును, ఏ సంవత్సరములో పరిస్థితులు అనుకూలంగా ఉంటాయి, ఆరోగ్యము, ఆదాయం మొదలగు విషయముల గురించి తెలుసుకోవటానికి ఈ సంఖ్యా శాస్త్రము ఉపయోగపడుతుంది.



మీరు ఒక పని చేయాలనుకొంటే మీ సంఖ్యకు చెందిన తారీఖులలో మీ పనులు చేస్తే ఆ రోజు మీరు పనిలో లాభం పొందే అవకాశము, మీ పని జరిగే అవకాశం ఉంది. మీకు మీ సంఖ్యకు చెందిన తేదీలలోనే లాభం జరగటానికి ఎక్కువ అవకాశం వుంది.

ఈ అంకెలలో కొన్ని మంచి చేస్తాయి, కొన్ని సంఖ్యలు కీడు చేస్తాయి. ఈ కీడు చేసే సంఖ్యలను శతృ సంఖ్యలు అంటారు. అందరికీ అన్ని సంఖ్యలు కలసి రావు. కొన్ని సంఖ్యలు చేడు చేస్తాయి. అలాంటి సంఖ్య ప్రభావం వున్న రోజులలో మీరు ఎలాంటి నూతన ప్రయత్నములు చేయరాదు. మీ సంఖ్యకు చెందిన తేదీలలోనే మీ ప్రయత్నములు చేయుట అన్ని విధాల మంచిది.

సంఖ్యాశాస్త్రమునకు మొత్తము 9 సంఖ్యల ఆధారము సంఖ్యలు కూడా తొమ్మిదియే ! ఈ సంఖ్యలు 1,2,3,4,5,6,7,8,9.

ఈ సంఖ్యా శాస్త్రమునకు వ్యక్తి యొక్క పుట్టిన తేదీయే ముఖ్య ఆధారము. మీ పుట్టిన తేదీ ప్రకారం మీరు ఏ సంఖ్యకు చేందిన వారో మొదట తెలుసుకొని ఆ తరువాత మీ సంఖ్య యొక్క గుణగణములు ఏమిటో తెలుసుకొని, మీ సంఖ్య యొక్క ప్రత్యేకత ఏమిటో తెలుసుకొని ఆ తర్వాత ప్రభావం మీ జీవితం పై ఎలా ఉంటుందో మీరు మీ నిజజీవితములో తెలుసుకోగలుగుతారు. మీ అనుభవం మీ సంఖ్య యొక్క ప్రభావం మీ పై ఎలా ఉందని మీరు గుర్తిస్తారు. కాబట్టి ప్రతీ వారు వారి పుట్టిన తేదీ ఆధారంతో వారు ఏ సంఖ్యకు చెందినవారో మొదట తెలుసుకోవాలి !

---

## వాత్సాయన

# పెళ్లి తర్వాత మజా..మస్తీ..జల్సాలు..అన్నింటికి బ్రేక్...! అవునా..?



మీ చుట్టూ వివాహ అయిన వారు ఉంటే, పెళ్లి జీవితంలో ఆనందాన్ని చంపుతుందని చెప్తారు. మన చుట్టూ ఉన్న అబ్బాయిలు, అమ్మాయిలూ వివాహాన్ని చాలా ఆహ్లాదంగా జరుపుకుంటారు. ప్రత్యేకంగా స్నేహితులలో ఒకరు వివాహం చేసుకునేటపుడు.



వారు మీకు స్వేచ్ఛ లేదు, మీ జీవితం నాశనమైనట్టే ఇది ఒక శిక్ష లాంటిది ఇలాంటి మాటలు అంటూ ఉంటారు. అది నిజమేనా? వివాహమనేది ఒక నిర్బంధం లాంటిది, ఇది స్వేచ్ఛని, స్వాతంత్ర్యాన్ని చంపేస్తుంది ఎందుకు? వివాహం అనేది కేవలం సంతోషం, ప్రేమ కోసం మాత్రమే ఎందుకు కాదు? సరే, ప్రజలు సాధారణంగా వివాహాన్ని అసహ్యించుకుంటారు, ఇప్పటికీ అలా జరగడానికి కారణాలేమిటో చూద్దాం. పెళ్లి తర్వాత వచ్చే సమస్య 1 పెళ్లి తర్వాత వచ్చే సమస్య 1 ఏ పెళ్ళైనా పాడయిపోవడానికి అత్తమామలు ఒక కారణం. మీరు అబ్బాయైనా లేదా అమ్మాయినా మీ భాగస్వామి తల్లిదండ్రులు మిమ్మల్ని సరిగా చూడరు, మీ భాగస్వామిని మీరు గౌరవించినప్పటికీ మీరు మీ వివాహాన్ని అసహ్యించుకోవడం మొదలుపెట్టవచ్చు. కానీ,భాగాస్వాములు గనక ఈ విషయాన్ని కూర్చొని స్నేహపూర్వకంగా పరిష్కరించుకుంటే అంతా మామూలైపోవచ్చు. పెళ్లి తర్వాత వచ్చే సమస్య 2 పెళ్లి తర్వాత వచ్చే సమస్య 2 ఆర్థిక స్వేచ్ఛ మరో కారణం.మీరు కనుక ఇన్నాళ్ళు డబ్బులను విచ్చలవిడిగా కర్చుపెట్టి ఉంటే , పెళ్లి తరువాత,మీ కుటుంబ భవిష్యత్తు కోసం మీ కర్చును తగ్గించుకోవాల్సి ఉంటుంది. పెళ్లి తర్వాత వచ్చే సమస్య 3 పెళ్లి తర్వాత వచ్చే సమస్య 3 ఏ పెళ్ళైనా అంతంకావడానికి తరుచూ వాదనలు కూడా మరో కారణం.కానీ మీరు అనుకూలమైన భాగస్వామిని ఎన్నుకుని, ఇద్దరిలో ఒకరు కోపంగా ఉన్నప్పుడు మరొకరు మౌనంగా ఉండడం అలవాటు చేసుకుంటే , సమస్యను ప్రతిశోధించు కోవచ్చు. పెళ్లి తర్వాత వచ్చే సమస్య 4 పెళ్లి తర్వాత వచ్చే సమస్య 4 అవును, పిల్లలు బరువు బాధ్యతలను పెంచుతారు కాబట్టి కొంతమందికి ఈ కారణంచేత పెళ్ళంటే గిట్టదు.కానీ మీరు పెంవుడు జంతువులను లేదా పిల్లలను పెంచుకుంటుంటే కనుక, వారు మీకు ఎంత ఆనందాన్నిస్తున్నారో పరిగణించుకోవాలే తప్ప; బరువు బాధ్యతలను కాదు! పెళ్లి తర్వాత వచ్చే సమస్య 5 పెళ్లి తర్వాత వచ్చే సమస్య 5 పెళ్లి మిమ్మల్ని లావుగా మరియు అనారోగ్యకరంగా మారుస్తుంది!!దీనివల్లే కొంతమంది ఫిర్యాదు చేస్తుంటారు. నిజానికి, మిమ్మల్ని లావుగా మార్చేది పెళ్లి కాదు; మీ జీవనవిధానం మరియు ఆహారవు అలవాట్లు. కాబట్టి మీ ఫిట్నెస్ లెవెల్స్ అదువులో ఉండడానికి ఒక మార్గం ఆలోచించండి. పెళ్లి తర్వాత వచ్చే సమస్య 6 పెళ్లి తర్వాత వచ్చే సమస్య 6 పెళ్లి మీ స్వేచ్ఛను నాశనం చేస్తుంది.స్నేహితులతో గడపడానికి సమయం ఉండదు! అయితే, మీకు



ప్రతిరోజూ లేదా మీ జీవితంలో ప్రతిక్షణం మీ స్నేహితులు మీతో ఉండాలా?అది అసాధ్యం! మీరు నెలకు ఒకసారి మీ స్నేహితులను కలిసి వారితో మంచి సమయం గడపవచ్చు. పెళ్లి తర్వాత వచ్చే సమస్య 7 పెళ్లి తర్వాత వచ్చే సమస్య 7 పెళ్లి సరసాన్ని అంతంచేస్తుంది. శృంగారం చికాకుగా తోస్తుంది. అయితే , మీరు పెళ్లి చేసుకున్నా చేసుకోకపోయినా; ఒకే మనిషిని ప్రేమించడం రేపోమాపో చికాకుగా తోస్తుంది.కాని ప్రేమ మీకు చికాకుగా అనిపించదు. భద్రత మీకు ఎప్పుడూ విసుగు అనిపించదు. కాబట్టి, మీరు కనుక మీ భాగస్వామిని ప్రేమించినట్లితే ,మిగిలిన విషయాలు అవే సర్దుకుంటాయి మరియు పెళ్లి అనేది జీవితంలో ఒక అందమైన అడుగు అవుతుంది.


అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తున్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్






సినిమాల్లో నటించాలని ప్రతి ఒక్కరికి ఉంటుంది. కొందరికి కుదురుతుంది. మరి కొందరికి కుదరదు. అంత మాత్రాన సినిమాల్లో ప్రయత్నం చేయని వాళ్లుకు సినిమాలు అంటే ఇష్టం లేక కాదు. అవకాశం దొరకక, కుటుంబ భాద్యతలు వల్ల సినిమాల్లో ప్రయత్నం చేయరు. అలాగా అని సినిమాని ద్వేషించే వాళ్లు కాదు.

# వెండితెర నుంచి బుల్లితెరకు ప్రయాణం






అవకాశం వస్తే సూద్దాం అనుకుంటారు. మరి కొందరు సినిమాల్లో అవకాశం రాకపోతే టివిల్లో కనిపిద్దాం. అనుకునే వాళ్లు ఉన్నారు. టివిలో ప్రయత్నం చేసే వాళ్లు సినిమాల్లో ప్రయత్నం చేయవచ్చు. ప్రయత్నం చేసిన మాత్రాన అవకాశాలు రావు. హీరో అవ్వలని వచ్చి, జూనియర్ వేషాలు చేసుకుంటూ కాలం గడుపుతు చాలా మంది హైదరాబాద్‌లోని కృష్ణనగర్‌లో చాలా మంది కనిపిస్తారు. దర్శకుడు అవ్వాలని వచ్చి అదే ఫిల్మ్ నగర్ నడి రోడ్డు వెంట తిరుగుతు అసిస్టెంట్ డైరక్టర్‌గా అవాళ్ల దగ్గర , ఇళ్ల దగ్గర పని చేసు పోట్ట పోస్తుకునే వాళ్లు చాలా మంది చిత్ర పరిశ్రమ లో తెల్లరితే కనిపిస్తారు. వారి అకలి మంటలు చాలా మందికి తెలియవు. సినిమాలో అందంగా కనిపిస్తారు. తెర మీద కనిపించాలి అన్న దేయ్యంతో సినిమాలో హీరో అవ్వాలని వచ్చే వాళ్లు చాలా మంది ప్రతి రోజు రైల్వ్ సేషన్ నుండి బస్సు స్టాండ్ నుండి ప్రతి రోజు చూట్టు ప్రక్కల నుండి లక్షల్లో సిటీకి వస్తుంటారు. ఎన్నో కలలు తో వస్తుంటారు. ఆ కలలు కలుగానే విగిలి పోతాయి అన్న సత్యం తెలిసే నాటికి కాలం కరిగిపోతుంది. తెలిసిన వాడు వెంటనే కోలుకుంటారు. తెలుసుకోని వాడు ఈ చిత్ర సీమ అనే సముద్రంలో పడి మునిగిపోతాడు . సినిమాలో నటిద్దాం అని వచ్చే లక్షల మందిలో ఒకరు మాత్రమే చిత్ర సీమలో సక్సెస్ అవ్వాతారు. అతని చూసి లక్షల మంది సిటీకి వస్తారు. సక్సెస్ అయిన ఒక్కడి చూస్తారు తప్ప తొంబై వందల తొంబై తొమిది మందికి ఎందుకు సక్సెస్ అవ్వాలేదు. అన్న అలోచన ఎవరికి రాదు. ఎవరికి వారు మనం సక్సెస్ అవ్వాతాం. వాడికి అంత సీన్ లేదు అనుకునే వాడే. అలాగే చిత్ర సీమలో ఉన్న వాళ్లు కూడా తెలియని ప్రపంచాని చూడాలని అందులోను పేరు తెచ్చుకోవాలి అనుకంటు ఉంటారు. అలా వచ్చిన వాడే ప్రకాష్ రాజ్. కష్టపడి తాను ఉన్నతి స్థానానికి ఎదిగారు. అదృష్టం ఎవరి సోత్తు కాదు. 5 భాషల్లో సోంతంగా మాట్లాడుగలడు. చిత్రపరిశ్రమను శాసించే స్థాయికి ఎదిగారు. ప్రకాష్ రాజ్‌ను ప్రక్కన పెడితే.

అమితాబ్ బచ్చన్ కౌన్ బనేంగే కరోడ్ పతి టివిలో ఫస్ట్ ప్రారంభించారు. 2000లో ప్రారంభమైన ఈ సిరిస్ 2013 వరకు కోససాగుతునే ఉంది. ఎంతగా ఈ గేమ్ సక్సెస్ అయ్యేందంటే అమితాబ్ బచ్చన్ 5,6 సిరిస్ వరకు ఆటను కోనసాగించారు. షారుక్ ఖాన్ కొన్నినాళ్లు కోనసాగించారు. ఆ తరువాత సైఫ్ అలీ ఖాన్ ఈ సిరిల్స్‌ను కోన సాగించారు. ఈ గేమ్‌ను స్ఫూర్తిగా తీసుకొని చాలా టివి చానల్స్ రకరకాల గేమ్స్‌ను ప్లాన్ చేశారు. చాలా గేమ్స్ సక్సెస్ కూడా అయ్యాయి. మరి కొన్ని ఫ్లాప్ అయ్యాయి. ఆ క్రమంలో తెలుగు ఛానల్స్‌లో ఫస్ట్ టైమ్ నాగార్జున యాంకరింగ్ చేశాడు. చిత్ర పరిశ్రమలో కింగ్‌గా మన్ననలను పొందుతున్న నాగార్జున మీలో ఎవరు కోటేశ్వరుడు కాన్సెప్ట్‌తో టివిలో ప్రేక్షకుల ముందుకు వచ్చారు. ఒక్కటి కాదు రెండు కాదు మూడు సిరిస్‌తో ప్రేక్షకుల మందుకు వచ్చాడు నాగ్. వెండితెర మీద ఒక వెలుగు వెలుగుతున్న నాగార్జున బుల్లితెర మీద ఒక యాంకర్‌గా తన విశ్వరూపాన్న చూపించాడు. అప్పుటికే హీరోగా 75చిత్రాల్లో నటించిన నాగార్జున బుల్లి తెర మీద నటించడం ఒక ఫ్లస్ అయింది. తప్ప నెగిటివ్‌గా మారలేదు. ఎంతో పేరును సంపాదించుకున్నారు. బాలీవుడ్‌లో అమితాబ్ బచ్చన్‌కు ఎంత పేరు వచ్చిందో అంతటి కన్న మిన్నగా తెలుగు చిత్రపరిశ్రమలో నాగార్జునకు అంతటి పేరు వచ్చింది. మూడు సిరిస్‌లోను నాగార్జున సక్సెస్ అయ్యాడు.

బుల్లితెర నుండి వెండితెరకు ప్రకాష్ రాజ్..







ప్రకాష్ రాజ్ దక్షిణ భారతదేశానికి చెందిన ఒక సుప్రసిద్ధ నటుడు. దాదావు రెండు వందల సినిమాలకు పైగా నటించి, ఐదు భారతీయ భాషల మీద పట్టున్న విలక్షణ నటుడు. ఇప్పటిదాకా నాలుగు జాతీయ పురస్కారాల్ని అందుకున్నాడు. బుల్లితెర మీద పేరు తెచ్చుకున్న వారు సినిమాల్లోకి ప్రవేశించాలని ప్రయత్నం చేస్తుంటారు. అలా ప్రయత్నం చేసి సక్సెప్ అయిన వాళ్ల చాలా తక్కువగా ఉంటారు. వారిలో ప్రధముడు ప్రకాష్ రాజ్. ప్రకాష్‌రాజ్ చాలా సీరియల్స్ లో నటించాడు. గుప్పెడంత మనసు సీరియల్స్ పలు సీరియల్స్‌లో ప్రకాష్ రాజ్ నటించాడు. కె బాలచందర్ ప్రకాష్ రాజ్ నటన చూపి తన సీరియల్స్‌తో పాటు సినిమాల్లో అవకాశం ఇచ్చాడు. అంచలఆంచలుగా ప్రకాష్ రాజ్ ఎదిగాడు. ప్రకాష్ రాజ్ లేని సినిమాలు ఉండవు. తెలుగ,తమిళ్,హిందీ,కన్నడ, మలయాళం భాషల్లో క్రేజ్ ఉన్న నటుడు. చిరంజీవి నటించిన హిట్లర్ చిత్రంలో మంచిపేరు వచ్చింది. చిరునవ్వుతో, సుస్వాగతం, చూడాలని ఉంది చిత్రాలు ప్రకాష్‌రాజ్‌కు మంచి పేరు వచ్చింది. బద్రి
అంతఃవురం, ఇంద్ర, ఇడియట్ చిత్రంతో వైవిధ్యమైన పాత్రలు పోషించారు. అంతఃపురం చిత్రంలో ముసలి వాడి పాత్రల్లో చక్కగా పెర్పొర్మన్స్ చూపించాడు. ఒక చిత్రంతో వైవిధ్యంగా చూపించాడు.

వెండితెర మీద ఒక వెలుగు వెలుగుతున్న నాగార్జున బుల్లితెర మీద ఒక యాంకర్‌గా తన విశ్వరూపాన్న చూపించాడు. అప్పుటికే హీరోగా 75చిత్రాల్లో నటించిన నాగార్జున బుల్లితెర మీద నటించడం ఒక ఫ్లస్ అయింది. తప్ప నెగిటివ్‌గా మారలేదు. ఎంతో పేరును సంపాదించుకున్నారు.

ప్రకాష్‌రాజ్ చాలా సీరియల్స్ లో నటించాడు. గుప్పెడంత మనసు సీరియల్స్ పలు సీరియల్స్‌లో ప్రకాష్ రాజ్ నటించాడు. కె బాలచందర్ ప్రకాష్ రాజ్ నటన చూపి తన సీరియల్స్‌తో పాటు సినిమాల్లో అవకాశం ఇచ్చాడు. అంచలఆంచలుగా ప్రకాష్ రాజ్ ఎదిగాడు. ప్రకాష్ రాజ్ లేని సినిమాలు ఉండవు. తెలుగ,తమిళ్,హిందీ,కన్నడ, మలయాళం భాషల్లో క్రేజ్ ఉన్న నటుడు. చిరంజీవి నటించిన హిట్లర్ చిత్రంలో మంచిపేరు వచ్చింది. చిరునవ్వుతో, సుస్వాగతం, చూడాలని ఉంది చిత్రాలు ప్రకాష్‌రాజ్‌కు మంచి పేరు వచ్చింది. బద్రి
అంతఃవురం, ఇంద్ర, ఇడియట్ చిత్రంతో వైవిధ్యమైన పాత్రలు పోషించారు. అంతఃపురం చిత్రంలో ముసలి వాడి పాత్రల్లో చక్కగా పెర్పొర్మన్స్ చూపించాడు. ఒక చిత్రంతో వైవిధ్యంగా చూపించాడు.

# హరహర మహాదేవ

**ఒకసారి పార్వతీదేవి పరమశివుని వద్ద శివరాత్రి గురించి అడుగుతుంది. అప్పుడు శివుడు శివరాత్రి ఉత్సవం తనకెంతో ఇష్టమనీ, ఇంకేమీ చేయకుండా ఆ రోజు కేవలం ఉపవాసమున్నాసరే తనెంతో సంతోషిస్తానని చెబుతాడు. ఆయన చెప్పిన దాని ప్రకారం, ఆ రోజు పగలంతా నియమ నిష్ఠతో ఉపవాసంతో గడిపి, రాత్రి నాలుగు జాముల్లోనూ శివలింగాన్ని మొదట పాలతో, తర్వాత పెరుగుతో, ఆ తర్వాత నేతితో, ఆ తర్వాత తేనెతో అభిషేకిస్తే శివునికి ప్రీతి కలుగుతుంది. మరునాడు బ్రహ్మవిదులకు భోజనం పెట్టి తాను భుజించి శివరాత్రి వ్రతం సమాప్తి చేయాలి. దీనిని మించిన వ్రతం మరొకటి లేదంటాడు పరమశివుడు.**

మామూలుగానైతే ఏ మాసమైనా కృష్ణ పక్ష చతుర్దశిని శివరాత్రిగా భావిస్తారు. కానీ, ఫాల్గుణ మాసపు చతుర్దశికి ప్రత్యేకమైన మహత్తు ఉంటుంది. అందుకే శివరాత్రిని ఆ రోజున బ్రహ్మాండంగా చేసుకుంటారు. మహాశివుడంటే అందరికీ తెలుసు. కానీ రాత్రి అంటే ప్రత్యేకార్థము చాల మందికి తెలియదు. రా అన్నది దానార్థక ధాతు నుండి రాత్రి అయిందంటారు. సుఖాన్ని ప్రదానం చేసేదాన్నే రాత్రి అంటారు. ఋగ్వేద రాత్రి సూక్తం తాలూకు యూప మంత్రంలో రాత్రిని ప్రశంసిస్తూ యిలా చెప్పబడింది.

*ఉప మాపేపిశత్తమః కృష్ణం వ్యవక్తమస్థిత్!*
*ఉష ఋణేవ యాతయ*

నిజంగానే రాత్రి ఆనందదాయిని అన్నింటికి ఆశ్రయం ఇవ్వగలది. అందుకే రాత్రిని ప్రశంసించటం జరిగింది. మహాశివరాత్రి వ్రతాన్ని రాత్రి పూటే జరుపుకుంటారు. అందువల్ల కృష్ణపక్ష చతుర్దశి రోజు వచ్చిన రాత్రికి ఓ ప్రత్యేకత వుంది. చతుర్దశి రోజు ఎవరైతే శివపూజను చేస్తారో, ఆ రాత్రి జాగర్ణం వహిస్తారో వారికి మళ్ళీ తల్లి పాలు తాగే అవసరం రాదు. అంటె ఆ భక్తుడు జీవన్ముక్తుడౌతాడని స్కందపురాణంలో స్పష్టంగా చెప్పబడింది. అంతటి మహిమాన్వితమైనది శివపూజ.

*శివంతు పూజయత్వా యోజా గర్తిచ చతుర్దిశీం!*
*మాతుః పయోధర రసం నపిబేత్ స కదాచన!!*



అందుకేనేమో గరుడ, స్కంద, పద్మ అగ్ని మొదలైన పురాణాల్లో దీనిని ప్రశంసించడం జరిగింది. వర్ణనలలో కొంత తేడా వుండొచ్చు. ప్రముఖ విషయం ఒకటే. ఏ వ్యక్తి అయితే ఆ రోజు ఉపవాసంచేసి, బిల్వ పత్రాలతో శివపూజ చేస్తారో, రాత్రి జాగరణ చేస్తారో వారిని శివుడు నరకాన్నుండి రక్షిస్తాడు. ఆనందాన్ని, మోక్షాన్ని ప్రసాదిస్తాడు. వ్రతం చేసే వ్యక్తి శివమయంలో లీనమైపోతాడు. దానము, తపము, యజ్ఞము, తీర్థయాత్రలు, వ్రతాలు లాంటివెన్ని కలిపినా మహాశివరాత్రికి సరితూగలేవు.

మహాశివరాత్రి రోజు ఉపవాసము, జాగరణ శివపూజ

**వ్రతాచరణానంతరం:** అటు తర్వాత శివ భక్తులకు భోజనము. వస్త్ర, ఛత్రములు ఇవ్వాలి. నిజానికి లింగోద్భవమైన అర్ధరాత్రి సమయం ప్రతిరోజూ వస్తుంది కనుక ప్రతిరోజూ శివరాత్రే. ప్రతిక్షణం శివస్మరణయోగ్యమే. అయితే కృష్ణపక్ష చతుర్దశి శివునికి ఇష్టమైన రోజు కనుక ప్రతినెలా వచ్చే ఆ రోజును మాసశివరాత్రి అన్నారు.

ప్రధానమైంది. అసలు వీటికి తాత్విక అర్థాలెన్నో ఉన్నాయి. అసలు వ్రతం గురించి భిన్న భిన్న గ్రంథాల్లో భిన్నార్థాలు గోచరిస్తున్నాయి. వైదిక సాహిత్యంలో దీని అర్థం వేద బోధితమని, ఇష్ట ప్రాపకర్మ అని వుంది. దార్శనిక గ్రంథాల్లో అభ్యుదయమని, నిః శ్రేయస్సు కర్మ అని, అమరకోశంలో వ్రతమంటే నియమమని వుంటే పురాణాల్లో మాత్రం ధర్మానికి పర్యాయవాచిగా ఉపయోగించబడింది. అన్నింటినీ కలుపుకుంటే వేదబోధిత అగ్నిహోత్రాది కర్మ, శాస్త్ర విహిత నియమాది, సాధారణ లేక అసాధారణ ధర్మమే వ్రతమని చెప్పవచ్చు. సులభంగా చెప్పుకోవాలంటే కర్మ ద్వారా ఇష్ట దేవుడి సామీప్యాన్ని పొందటమే అని అనవచ్చు.

మహాశివరాత్రి వ్రతం రోజు ఉపవాసానికి చాలా ప్రాముఖ్యత నిచ్చారు. అలా అని తిథితత్వంలో చెప్పబడింది. ఈ గ్రంథంలో భగవాన్ శంకరుడు ఇలా అన్నట్లు వుంది. మీరు స్నానం చేసినా, మంచి వస్త్రాలు ధరించినా, ధూపాలు వెలిగించినా, పూజ చేసినా పుష్పాలంకరణ చేసినా వీటన్నిటికంటే కూడా ఎవరైతే ఉపవాసం చేయగలరో వారంటేనే నాకిష్టం అంటాడు శివుడు.

**ఉపవాసం అంటే ?**

ఎవరికైనా దగ్గరగా వసించటం, నివశించటం, ఉండటాన్ని ఉపవాసమంటారు. వ్రతం చేసేవారి ఇష్టదైవం దగ్గర ఉండటమే ఉపవాసం ఉపవాసమంటే ఇంతేనా అని పెదవి విరిచే వారికోసమే ఈ శ్లోకం.

*ఉప సమీపే యో వాసః జీవాత్మ పరమాత్మనోః*
*ఉపవాసః సవిఘ్నేయ సర్వభోగ వసర్జిత్:*
*(వరాహోపనిషత్తు)*

భవిష్య పురాణంలో కూడా అలాగే చెప్పబడింది.

వెలుపలి గోడపై ఆధ్యాత్మికత ఉట్టిపడేలా కళా సంపదను సమకూర్చారు. చతురస్రాకారంగా ఉన్న ఈ నిర్మాణం ఒకటికిపైగా చదరపు మీటర్ల వైశాల్యాన్ని కలిగి ఉంది. ఈ నిర్మాణాన్ని మొత్తం రాతితోనే కట్టారు. ఈ రెండు ప్రహారీల మధ్య ఉన్న విరామమే ఈ భారీ నిర్మాణ అందానికి కేంద్రబిందువు. శివలింగ గోపురంపై 14 రకాల నిర్మాణాలు కనిపిస్తాయి.

ఉపావృత్తస్య పాపేభ్యోయస్సు వాసో గుణైః సహా!
ఉపవాసః న విఘ్నేయ సర్వభోగ వివర్జిత్:

మహాశివరాత్రి వ్రతంలో జాగరణ అవసరము. వ్రతానికి యోగ్యమైన కాలము రాత్రి. ఎందుకంటే రాత్రి పూట భూత, శక్తులు, శివుడు తిరిగే సమయమన్నమాట. చతుర్దశి రాత్రి ఆయనను పూజించాలి. భగవాన్ శ్రీకృష్ణుడు గీతలో ఇలా స్పష్టంగా చెప్పారు. సమస్త ప్రాణుల నిగ్రహ పురుషుడు రాత్రి కాలంలో మేల్కొని తిరుగుతుంటాడు. అతనిలోని ప్రాణులన్నీ జాగృతంగా ఉంటాయి. అంటే భోగ, సంగ్రహంలో మునిగి ఉంటారు. తత్వాన్ని అర్థం చేసుకోగల మునుల దృష్టిలో రాత్రి అది.

యానిశా సర్వ భూతానం తస్యాం జాగర్తి సమ్యమీ
యస్యాం జాగృతి భూతాని సానిశాపశ్యతో మునే

విషయాసక్తుడు నిద్రలో వుంటే అనుద్లో నిగ్రహస్తుడు ప్రబుద్ధంగా ఉన్నాడు. అందువల్ల శివరాత్రి రోజు జాగరణ ముఖ్యమన్నమాట. శివునితో ఏకీకరణమవటమే నిజమైన శివపూజ. ఇంద్రియాభిరుచుల్ని నిరోధించి పూజించటమే శివవ్రతము.

*గరుడ పురాణంలో:* శివరాత్రి ఎలా చేసుకోవాలంటే గరుడ పురాణంలో ఇలా వుంది త్రయోదశి రోజునే శివ సన్మానము గ్రహించి, వ్రతులు

## పునాదులే లేని శివాలయం

కింది నుంచి చూస్తే ఆ ఆలయం ఒక పెద్ద కొండలా కనిపిస్తుంది. దాని గోపురం ఎత్తు 216 అడుగులు. ఇంత ఎత్తైన దేవాలయం కోసం ఎంత లోతు పునాది తీశారో అనుకుంటాం. ఇది సహజం. కాని ఆ దేవాలయానికి అసలు పునాదే లేదు. నమ్ముతారా ? ఎవరు నమ్మినా.. నమ్మకపోయినా.. ఇది నిజం. ఇంత ప్రత్యేకత ఉన్న ఈ దేవాలయం తమిళనాడు రాష్ట్రంలోని తంజావూరులో ఉంది. మేరు పర్వతంలాంటి ఎత్తైన ఈ కట్టడం కళలు, ఆధ్యాత్మికతకే కాదు, వెయ్యేళ్ళ కిందటి నిర్మాణ నైపుణ్యతకు అద్దం పడుతోంది. ఇంత వరకూ ఈ నిర్మాణం చెక్కు చెదరలేదు. ఇలా ఒకటి కాదు. రెండు కాదు. వెయ్యేళ్ళుగా అలాగే ఉంది. ఇది అందరికీ ఆశ్చర్యం కలిగిస్తుంది.



కొన్ని ప్రతిబంధకాల్ని గమనించాలి. అంటే కొన్ని నియమాల్ని మనసులో నిర్ధారించుకుని పాటించాలి. మీ ప్రకటన ఇలా ఉండాలి హే మహాదేవా! నేను చతుర్దశి రోజు జాగరణ చేస్తాను. నా భక్తి సామర్ధ్యాన్ని బట్టి దాన, తప, హోమాన్ని చేయగలను. నేను ఆ రోజు నిరాహారిగా ఉంటాను. రెండవరోజు మాత్రమే తింటాను. ఆనంద, మోక్షాలను అనుగ్రహించు శివా!

అలా వ్రతం చేశాక గురువు దగ్గరికి వెళ్ళాలి. పంచామృతంతో పాటు పంచగవ్యాలును (ఆంటే అయిదు విధములైన గో సంబంధిత వస్తువులు ఆవు పేడ ఆవు పంచితము, ఆవుపాలు, ఆవు పెరుగు, ఆవునెయ్యి) శివలింగాన్ని అభిషేకం చేయించాలి. అభిషేకం చేస్తున్న సమయంలో ఓం నమః శివాయ అనుకుంటూ జపించాలి. చందన లేపనంతో ప్రారంభించి అన్ని ఉపాచారాలతో పాటూ శివపూజ చేయాలి. అగ్నిలో నువ్వులు, బియ్యము, నెయ్యితో కలిపిన అన్నము వేయాలి. ఈ హోమము తర్వాత పూర్ణాహుతి నిర్వహించాలి. అందవైన శివ కథలు వినవచ్చు. వ్రతాలు

మరొకసారి రథరాత్రి మూడవ, నాల్గవ ఝాములో ఆహుతులను సమర్పించాలి. సూర్యోదయం అయ్యేంతవరకూ మౌన పాఠం చేయదలచినవారు ఓం నమః శివాయ అంటూ భగవాన్ శివుని స్మరిస్తూ ఉండాలి. ఆయనను భక్తులు కోరుకునేది ఏమిటంటే పర మాత్మా! మీ అనుగ్రహంతో నేను నిర్విఘ్న పూజ కొనసా గించి పూర్తి చేసాను. హే లోకేశ్వరా! శివ భవా! నన్ను

క్రీస్తు శకం 1003-09లో ఆ ప్రాంత రాజు అయిన రాజరాజ చోళుడు ఈ దేవాలయాన్ని నిర్మించారు. ఈ పవిత్ర దేవాలయంలోనికి ప్రవేశించగానే 13 అడుగుల ఎత్తు ఉన్న శివలింగం కనిపిస్తుంది. ఐదు పడగల నాగేంద్రుని నీడన శివలింగ రూపంలో పరమేశ్వరుడు దర్శనమిస్తారు. ఈ మొత్తం నిర్మాణంలోకి ఇది ఒక అద్భుత దృశ్యం.

క్షమించు. ఈ రోజు నేను అర్జించిన పుణ్యమంతా, మీకు అర్పితం గావించి నదంతా మీ కృపతోనే పూర్తి చేశాను. హే కృపానిధీ! మా పట్ల ప్రసన్నులు కండి! మీ నివాసానికి వెళ్ళండి. మీ దర్శనమాత్రము చేతనే మేము పవిత్రులం అయ్యాము.

**వ్రతాచరణానంతరం:** అటు తర్వాత శివ భక్తులకు భోజనము. వస్త్ర, ఛత్రములు ఇవ్వాలి. నిజానికి లింగోద్భవమైన అర్ధరాత్రి సమయం ప్రతిరోజూ వస్తుంది కనుక ప్రతిరోజూ శివరాత్రే. ప్రతిక్షణం శివస్మరణయోగ్యమే. అయితే కృష్ణపక్ష చతుర్దశి శివునికి ఇష్టమైన రోజు కనుక ప్రతినెలా వచ్చే ఆ రోజును మాసశివరాత్రి అన్నారు. అందులోనూ మాఘ బహుళ చతుర్దశి ఆయనకు మరీ మరీ ప్రీతి కనుక ఆ రోజున మహా శివరాత్రి జరుపుకుంటున్నాం. ఆ రోజు ఉదయం స్నానాదికాలం తర్వాత వీలైతే శివాలయాన్ని దర్శించి, అవకాశం లేకపోతే, ఇంటివద్దే ఉమామహేశ్వ రులను శివప్రీతికరమైన పువ్వులతో, బిల్వదళాలతో అర్చిం చాలనీ, శక్తికొలదీ పాలు,గంగోదకం, పంచామృతాదులతో లింగాభిషేకం చేయాలనీ, ఉపవాస, జాగరణ శివస్మరణలతో రోజంతా గడిపి మరునాడు ఉత్తమ విప్రులకు, శివభక్తులకు భోజనం పెట్టాలని వ్రత విధానాన్ని బోధించారు.

**లింగోద్భవ కాలం:** శివరాత్రికి లొంగోద్భవ కాలమని కూడా పేరు. ఆ రోజు అర్ధరాత్రి జ్యోతిర్మ యమైన ఒక మహా లింగా శివుడు ఆవి ర్భవించాడు. పరమేశ్వ రుడు లోకా నికి తన స్వరూప దర్శనం చేయించి జగత్తంతా దేదీప్య మానం చేసిన ఆ సమయంలో మనం నిద్రపోవడంలో అర్థం లేదు. అందుకే శివరాత్రి జాగరణకు అంత ప్రాధాన్యం . ఆ రోజు అభిషేకాదులతో శివుని పూజించి ఉపవాసముండి రోజంతా శివనామస్మరణంతో గడపడం లోని ఉద్దేశం మన తనువునూ, మనసునూ కూడా శివార్పితం, శివాంకితం చేయడానికే. శివమంటే జ్ఞానమే. జన్మ పరంపర శృంఖలాలను తెంచి నిత్యానంద ప్రదమైన మోక్షాన్ని అందించే శక్తి ఆ జ్ఞానానికే ఉంది.

శివరాత్రినాడు పధ్నా లుగు లోకాలలోని పుణ్యతీర్థాలు బిల్వ మూ లంలో ఉం టాయనీ, శివరాత్రి నాడు ఉపవ సించి ఒక్క బిల్వమైనా శివా ర్పణ చేసి తరించమని శాస్త్రం చెబుతోంది. కనీ సం జన్మకొక్క శివరాత్రి అయినా చేయమని పెద్ద లు చెబుతుం టారు. సమ స్త ప్రాణికోటిలో సూక్ష్మజ్యోతిరూపంలో ఉండే శివుడు భూమిపై పార్థివలింగంగా ఆర్చింపబడుతుంటాడు. శివరాత్రినాడు ఫలం, ఒక తోటకూర కట్ట అయినాసరే శివార్పణం అని దానం చేయడం ముక్తిదాయకం. కలిగిన వారు వారి వారి శక్త్యానుసారం బంగారం, వెండి కుందు లలో ఆవునేతి దీపం వెలిగించి ఓ పండితునికి సమర్పిస్తే అజ్ఞానంధకారం నశిస్తుందని పెద్దలవాక్కు. శివరాత్రినాడు ఉపవసించి త్రికరణ శుద్ధిగా శివుని ఆరాధిస్తే, ఒక సంవత్సర కాలం నిత్యం శివార్చన చేసిన ఫలం కలుగుతుందని సాక్షాత్తు శంకరుడు బ్రహ్మదేవునికి చెప్పినట్లు పెద్దలవాక్కు.

క్రీస్తు శకం 1003-09లో ఆ ప్రాంత రాజు అయిన రాజరాజ చోళుడు ఈ దేవాలయాన్ని నిర్మించారు. ఈ పవిత్ర దేవాలయంలోనికి ప్రవేశించగానే 13 అడుగుల ఎత్తు ఉన్న శివలింగం కనిపిస్తుంది. ఐదు పడగల నాగేంద్రుని నీడన శివలింగ రూపంలో పరమేశ్వరుడు దర్శనమిస్తారు. ఈ మొత్తం నిర్మాణంలోకి ఇది ఒక అద్భుత దృశ్యం.

దీని చుట్టూ ఆరడుగులు ఖాళీ ఉండేటట్లు రెండు వెడల్పాటి గోడలను నిర్మించారు. వెలుపలి గోడపై ఆధ్యాత్మికత ఉట్టిపడేలా కళా సంపదను సమకూర్చారు. చతురస్రాకారంగా ఉన్న ఈ నిర్మాణం ఒకటికిపైగా చదరపు మీటర్ల వైశాల్యాన్ని కలిగి ఉంది. ఈ నిర్మాణాన్ని మొత్తం రాతితోనే కట్టారు. ఈ రెండు ప్రహారీల మధ్య ఉన్న విరామమే ఈ భారీ నిర్మాణ అందానికి కేంద్రబిందువు. శివలింగ గోపురంపై 14 రకాల నిర్మాణాలు కనిపిస్తాయి. శివలింగంపై 216 అడుగుల వరకు కూడా ఖాళీగానే ఉంది. చివరిదైన 14వ నిర్మాణంపై దాదాపుగా 88 టన్నుల బరువు కలిగిన రాతి గుండును నిలిపారు. దీని బరువు మొత్తం నిర్మాణంపై పడుతుంది. ఇది చోళుల శిల్పకళలకు నిదర్శనం. అన్నిటికంటే పైభాగాన 12 అడుగుల కుంభాన్ని ఏర్పాటు చేశారు.

లోపల ఉన్న ఖాళీ ప్రదేశమంతా శిల్ప, వాస్తు కళలతోనే కాకుండా ఆధ్యాత్మికత ఉట్టిపడేలా ఒకే చోట 7 ఆలయాలున్నాయి.వాటిలో శివాలయం ప్రధాన ఆకర్షణ.రామ మందిరం , హనుమాన్ గుడి వున్నాయి. ఆ ఆలయాలు క్రీ.శ.6వ శతాబ్ధం నుంచి 9వ శ. వరకు రూపుదిద్దుకొన్నాయి.







# వింతలు- విడ్డూరాలు



మా మొసళ్లకో ప్రత్యేకమైన విద్య వచ్చు తెలుసా? నీటి లోపల వేటాడిన జంతువును నీరు మింగకుండా అక్కడే తినేయగలం.

ప్రపంచంలో అత్యధిక పోస్టాఫీసుల్ని కలిగి ఉన్నది మనదేశమే.

మీరు 8 ఏళ్ల 7 నెలల 6 రోజుల పాటు ఆగకుండా అరిస్తే అందులో ఉత్పన్నమయ్యే శక్తితో ఒక కప్పు కాఫీని వేడి చేయవచ్చు.

cucumber

కీరా దోసకాయలో 96 శాతం నీరే ఉంటుంది.

1932లో అమెరికాలో కొద్ది రోజులు కలపతో కరెన్సీ నోట్లను తయారుచేశారు.

ఎండ్రకాయ రక్తం నీలం రంగులో ఉంటుంది.

Crab blood is Blue in color

మధురమే... మట్టి పరిమళం!

తొలకరి చినుకులు ముద్దాడగానే పుడమి పరవశించి గుప్పున గుబాళిస్తుంది అనుకుంటాం. అందుకే మధురమైన ఆ మట్టివాసనను శ్వాస ఎగబీల్చి మరీ ఆస్వాదిస్తాం. కానీ ఆ వాసన వానదీ కాదు, మట్టిదీ కాదు, మట్టిలో ఉండే యాక్టినో సైనోబ్యాక్టీరియాది. ఎండల్లో అవి పెట్టిన గుడ్లు, చినుకు తాకిడికి పగలడంతో వాటిల్లోని జియోస్మిన్ అనే పదార్థం, ఒకరకమైన వాసనని వెదజల్లుతుంది.

కోడిగుడ్డు పెంకుపై 17,000 సూక్ష్మరంధ్రాలు ఉంటాయి

జపాన్‌లో 80 శాతం మంది పిల్లలు సైకిళ్లను వాడుతారు!

తుపాను గాలిలో విడుదలయ్యే శక్తి ఒక మెగాటన్ను బాంబులతో సమానం.

11-octo-06

## ఎత్తు నుంచి పడినా ఏం కాదా? అబ్బే...

అపోహ: ఎంత ఎత్తు నుంచి పడినా పిల్లి నాలుగు కాళ్ళ మీద నుంచే గలుగుతుంది!

"అంతా నయం.. పిల్లికేం కాదులే అని మేడమీంచి పడేశారు కాదు... జరేవారండీ! ఐదారు అంతస్థుల ఎత్తు నుంచి అనుకోకుండా పడిపోయిన కొన్ని పిల్లులు అదృష్టం బాగుండి బతికినంత మాత్రాన అన్నింటికీ ఈ విద్య ఉందనుకుంటే ఎలా? అదే నిజమైతే అపార్ట్‌మెంట్లలో కూడా పాలు జుర్రేసి కిటికీలోంచి దూకేయమూ? మా చెవి లోపల ఉండే ఒక అవయవం వల్ల పడిపోతున్నప్పుడు అవగాహన కలిగి అసంకల్పితంగా మేం పారాచూట్ లాగా కాళ్ళు చాపుకుని నేలమీద పడతామని మీ శాస్త్రవేత్తలు అంటుంటారు. ఒకవేళ అది నిజమైనా కూడా దెబ్బలు తగలకుండా తప్పించుకోవడం మాకు అసాధ్యం. ఎత్తు నుంచి పడితే మా కాళ్ళు విరుగుతాయి. లోపలి ఎముకలు చిట్లుతాయి. అన్నట్టు.. మామీద మీకు ఇంకో అపోహ కూడా ఉంది.. మాకు ఈత రాదని! ఎడారి ప్రాంతాల్లో పుట్టి పెరిగిన పిల్లులకైతే రాదు కానీ మిగతావి కావు. మాకు నీళ్ళంటే పెద్దగా ఇష్టం ఉండదంతే. కానీ అలవాటు చేస్తే నేర్చుకుందామనే ఈదగలం తెలుసా?"





తనకి తాను యజమాని కాలేని మనిషి ఎన్నటికీ స్వతంత్రుడు కాలేడు - ఎపిక్టిటస్

కథ

# సెల్‌ఫోన్



"ఒరేయ్ శ్రవణ్! కాలేజీకి టైమవుతుంది. నిద్రలే నాన్నా. ఇంకా ఎంతసేపు పడుకుంటావ్" అంటూ పిలిచింది తల్లి శ్రావణి. " నేను కాలేజీకి వెళ్లను నేను చదువుకోను" అని జవాబిచ్చాడు శ్రవణ్". ఎందుకురా ఏమయింది ? అంది తల్లి.

"నాకు కొత్తబండి కావాలని నెల రోజుల నుంచి చెప్తున్నా. అయినా కొనిస్త లేరు. నాకు బండి , సెల్ ఫోన్ కావాలి ఒక్కొక్కడు మెడల బంగారం చైన్, చేతికి బ్రాస్‌లెట్, ఉంగరాలు, కొత్తకొత్త డ్రెస్‌లు వేసుకుని బండ్ల మీద కాలేజీకి వస్తున్నారు. మీనాన్న టీచరు నీవు గిట్ల ఎందుకు వస్తవు అని నాఫ్రెండ్స్ అడుగు తున్నారు" అన్నాడు శ్రవణ్.

"నీ తమ్ముణ్ని చూస్తే అట్లున్నడు . వానికి మెదడు వికసించడం లేదు. చదువు రాదు. తిని తిరగబట్టే. కొంచెము చదువు అచ్చినోడివి ఇట్లా చేయవడితివి" అని బాధపడింది శ్రావణి.

" తాతలు సంపాదించిన ఆస్తి లేదు. ఒక్క ఉద్యోగం మీద ఎన్ని కోరికలు నేరవే రుతాయి. నాకూ బంగారం పెట్టుకోవాలని లేదా ? నల్లపూసలు తోని కాలం గడుపుతున్నా. నాకు మంచి బట్టలు కట్టుకోవాలని లేదా? మీరు మంచిగ ఉంటే చాలు అని అనుకుంటున్నా . మీ నాన్న ను ఎప్పుడన్నా బాధపెట్టినా . మీనా న్నమ్మ , తాతయ్యల మందులకే డబ్బంతా ఖర్చు కావట్టే " అని ఏడ్చింది శ్రావణి.

" ఇంకా రెండు సంవత్సరాలు మీరు ఖర్చు పెడితే నా చదువు అయిపోతది. నేను ఏదో ఒక పని చేసి బతుకుతా . అప్పుడు మీరు నాకు ఇవ్వవలసినఅవసరం లేదు. నా కోరిక బండి, సెల్‌ఫోన్ కావాలి " అని మంకుపట్టు పట్టాడు శ్రవణ్.

"నాన్న బయటకు వెళ్లాడు వచ్చినంక చెబుతా, నీవు లేచి కాలేజీకి వెళ్లు" అంది తల్లి.

"నాన్న వచ్చినాంక నేను లేస్తా" అన్నాడు శ్రవణ్.

వెంకటేశం బజారు నుండి కూరగాయలు తీసుకుని వచ్చాడు.

"శ్రవణ్ నిద్రలేవలేదా?కాలేజీకి పోడా" అన్నాడు వెంకటేశం.

"వానికి బండి, సెల్‌ఫోన్ కొనిస్తే కాలేజీకి పోతాడట. లేకుంటే చదువుకోడట! " అంది శ్రావణి.

న్నా అది ఎత్తి నెలరోజుల వరకు బండి, సెల్‌ఫోన్ కొనిస్తా లేచి కాలేజీకి పొమ్మను " అని చెప్పి స్కూలుకు వెళ్లి పోయాడు వెంకటేశం.

ముసుగు కప్పి పడుకున్న శ్రవణ్ , తండ్రి మాటలు వినగానే లేచి సంతోషంతో గంతులు వేశాడు.

అన్నట్లుగానే నెల రోజులకు బండి , సెల్‌ఫోన్ కొనిచ్చాడు వెంకటేశం.

" ఇది కొనియ్యి అది కొనియ్యి అని ఆడించినట్లు కాదు .బుద్ధిగా చదివి మంచి ర్యాంకు తెచ్చుకోవాలి" అంది శ్రావణి.

"తప్పకుండా చదువుతాను అమ్మా!" అన్నాడు శ్రవణ్. శ్రవణ్ ఎంత అల్లరి చేస్తాడో అంత మంచిగా చదువుతాడు తన క్లాసులో . సెకండు మార్కులు తనవే.

అన్నట్లుగానే చాలా కష్టపడి చదివాడు శ్రవణ్ . ఈ రోజు ఆఖరు పరీక్ష" అమ్మా ! నేను పరీక్ష రాసి మా ఫ్రెండ్సు ఇళ్లకు వెళ్తొస్తా నా కొరకు ఎదురు చూడకు" అన్నాడు శ్రవణ్.

"రేపు పోదువు లేరా! ఈ రోజు రెస్టు తీసుకో .ఇప్పటి దాకా చదివావు కదా!" అంది తల్లి .

శ్రవణ్ పరీక్ష రాసి బయటకు వచ్చాడు. బాగా రాశానని తృప్తితో బండి నడుపుతున్నాడు. జేబులో ఉన్న సెల్ మోగింది. సిద్దిపేటలో ఉన్న ఫ్రెండ్ మహేశ్ ఫోన్ చేశాడు. పరీక్షలు ఎలా రాశావని బండి నడుపుతూ మాట్లాడుతు న్నాడు. ఎదురుగా వస్తున్న ఆటోను బండి గుద్దేసింది. ఎగిరి కిందపడ్డాడు శ్రవణ్. స్పీడ్ గా వెళ్లకపోవడంతో కాలుమాత్రమే విరిగింది. లేకపోతే ప్రాణాలు పోయేవి.

శ్రవణ్ మేనమామ కైలాసం హాస్పిటల్‌కు వచ్చి " సెల్‌ఫోన్‌లో మాట్లాడుతూ బండి నడపడమేమిటీ? నేటి యువతకు ఇదో పెద్ద షోకయ్యింది. మొన్న విక్రం అనే అబ్బాయి బండి నడుపుతూ సెల్‌లో మాట్లాడాడు ఎదురుగా వస్తున్న లారీ గుద్ది అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు " అంటూ కోప్పడ్డాడు.

"ఫోన్ వద్దురా అంటే వినకపోతివి? కాలు విరిగింది. హాస్పిటల్ ఖర్చులెట్లా పెట్టుకోవాలే. నీ చదువు ఖర్చులెలా భరించాలి? " అంటూ తల్లి శ్రావణి ఏడ్చింది.

"అమ్మా ! ఇక నుంచి బండి నడుపుతూ సెల్ మాట్లాడను ఐనా ఇప్పుడు నాకు సెల్‌ఫోన్ వద్దు " అంటూ లెంపలేసుకునానడు శ్రవణ్.

– రేగులపాటి విజయ లక్ష్మి

# కళ్లు చూసి ఎవరు ఎలాంటివారో చెప్పొచ్చు... ఎలాగంటే!

మీ కళ్ల రంగు మీ వ్యక్తిత్వం గురించి తెలియజేస్తుంది. ఇదే సమయంలో ఎదుటి వారి కళ్లను చూసి వారు ఎలాంటి వారో ఇట్టే పట్టేయొచ్చని స్పిరిచ్యువల్ హీలర్ మధు కోటియా చెబుతున్నారు. కళ్ల రంగులను అనుసరించి ఎవరెలా ఉంటారంటే...

నల్ల రంగులో ఉండే కళ్లు

ఈ రంగు కళ్లను రహస్యాన్ని సూచిస్తాయి. వారి వద్ద ఏదో విషయం ఉందని భావించవచ్చు. వీరు అత్యధికులను నమ్ముతారు. ఒకరి రహస్యాలను మరొకరితో పంచుకోరు. ఎక్కువగా కష్టపడే లక్షణాన్ని కలిగివుంటారు. తమ ప్రతిభను ఇతరులకు ఎలా చూపించాలో వీరికి బాగా తెలుసు.

గోధుమ రంగు కళ్లు

వీరు ఆకర్షణీయంగా ఉంటారు. ఆత్మవిశ్వాసాన్ని, క్రియేటివిటీనీ ఎక్కువగా చూపుతారు. ఇతరులకు కొంచెం కఠినమైన వ్యక్తిత్వం కలవారిగా కనిపిస్తారు.

లేత గోధుమ రంగులో కళ్లు

పరిస్థితులకు తగ్గట్టుగా ప్రవర్తిస్తుంటారు. ఇతరులకు వినోదాన్ని కలిగించాలని భావిస్తారు. సాహసాలు చేయడం వీరికి ఇష్టం. వీరు ఎదుటివారిని వెంటనే ఆకర్షించినప్పటికీ, ఆ బంధాన్ని దీర్ఘకాలం కొనసాగించడంలో విఫలమవుతారు.

బూడిద రంగు కళ్లు

వీరిలో హుందాతనం మూర్తీభవించి వుంటుంది. ఆధిపత్యాన్ని ప్రదర్శిస్తుంటారు. చేయాలనుకున్నదాన్ని చేసుకుంటూ వెళ్లిపోయే రకం. ప్రేమ, రొమాన్స్ తదితరాలకు ఎక్కువ విలువనిస్తారు. మానసికంగా బలంగా ఉంటూ, పరిస్థితులను విశ్లేషించి కష్టకాలం నుంచి నెట్టుకు వచ్చేస్తారు.

పచ్చ రంగు కళ్లు

తెలివితేటలు వీరి సొంతం. జీవితాంతం కొత్త విషయాల పట్ల ఆసక్తిని చూపుతారు. చేసే పనిని ఆనందిస్తూ చేస్తారు. త్వరగా అసూయపడే స్వభావం వీరికున్న అవలక్షణం.

నీలి రంగు కళ్లు

శాంతంగా, స్మార్ట్ గా ఉంటూ ఇతరులను ఆకర్షిస్తారు. వారితో దీర్ఘకాల బంధాన్ని కొనసాగిస్తారు. నిజాయతీతో ఉంటూ ఇతరులను ఆనందంగా ఉంచేందుకు కృషిచేస్తారు. చుట్టూ జరుగుతున్న విషయాలను నిశితంగా గమనిస్తుంటారు.

# 'టెక్స్ట్ నెక్ పోశ్చర్' బాధిస్తోందా?... అయితే, ఇలా చేయండి!

ఇంటర్నెట్ వాడకం పెరిగిపోయింది. డెస్క్ టాప్, ల్యాప్ టాప్, స్మార్ట్ ఫోన్ పై గంటల కొద్దీ సమయాన్ని గడిపేస్తున్నారు. అదే సమయంలో శారీరక వ్యాయామానికి వెచ్చించే సమయం తగ్గింది. దీంతో పలు రుగ్మతలు శరీరాలను పట్టిపీడిస్తున్నాయి. ఈ మధ్య కాలంలో టెక్కీలను బాధించే సమస్యల్లో ప్రధానమైనది మెడ నొప్పి. దీనినే ఇప్పుడు 'టెక్స్ట్ నెక్ పోశ్చర్' అని పిలుస్తున్నారు. కంప్యూటర్, స్మార్ట్ ఫోన్ తో పని చేసినప్పుడు ముందుకు వంగి పని చేస్తుంటాం. దీని వల్ల మెడపై అదనపు బరువు పడుతుంది. నిల్చునేప్పుడు కూడా సరైన భంగిమలో నిల్చోలేకపోతున్నారు. దీంతో నడుంతోపాటు, మెడపై కూడా అదనపు ఒత్తిడి పడుతోంది. ఇలా టెక్కీలను టెక్స్ట్ నెక్ పోశ్చర్ బాగా ఇబ్బంది పెడుతోంది. దీనికి వైద్యులను సంప్రదించడంతో పాటు స్వీయ పరీక్షలు చేసుకుని సరిదిద్దుకుంటే ఈ సమస్య నుంచి బయటపడవచ్చని నిపుణులు సూచిస్తున్నారు.



నిల్చునేటప్పుడు రెండు భుజాలు సమానంగా ఉన్నాయో, లేదో సరిచూసుకోవాలని, రెండు భుజాలు సమానంగా లేని పక్షంలో రెండు భుజాలు సమానంగా ఉండేలా నిటారుగా నిల్చోవాలని చెబుతున్నారు. అలాగే నడిచేటప్పుడు నిటారుగా నడుస్తున్నారా? లేక ఒక వైపు ఒంగి నడుస్తున్నారా? అన్నది సరిచూసుకోవాలని వారు సూచిస్తున్నారు. కంప్యూటర్ పై పని చేసేటప్పుడు రెండు భుజాలకు తల సమాన దూరంలో ఉంటుందో, లేదో సరి చూసుకోవాలని వారు చెబుతున్నారు. సరైన పోశ్చర్ లో కూర్చుంటే మెడ, నడుం నొప్పి నుంచి ఉపశమనం పొందవచ్చని నిపుణులు సలహా ఇస్తున్నారు.



ఈ ప్రపంచం కఠినాతి కఠినమైంది. ఈ వాస్తవాన్ని ఎదుర్కోవడంలోనే సంతోష రహస్యం ఇమిడి వుంది. -బెర్ట్రండ్ రస్సెల్

# సూర్య బుడత



## • పద్యాలు తెలుసుకుందామా

**నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు**
**తళుకుబెళుకు రాళ్ళు తట్టెడేల?**
**చాటు పద్యములను చాలదా ఒక్కటి**
**విశ్వదాభిరామ వినుర వేమ**

**తాత్పర్యం:** నిజమైన మంచి నీలము ఒక్కటున్నాదానికి విలువ వుంటుంది కాని బుట్టనిండుగా తళుకు రాళ్ళకు విలువ వుండదు. అలాగే మంచి పద్యం ఒక్కటీ చాలును కదా.



# అమాయకత్వం

భద్రపురం గ్రామంలో ఆనందాచారి అనే గురువు, భాస్కరం అనే శిష్యుడు ఉండేవారు. భాస్కరం చాలా అమాయకుడు. ఏ పని చెప్పినా సులువుగా అర్థం చేసుకోలేకపోయేవాడు. అయినా గురువుగారు శిష్యుడు అనాథ కావడంతో తన వద్దనే అట్టిపెట్టుకున్నాడు.

ఆనందాచారి కొత్త ఇల్లు కట్టుకుని గృహప్రవేశం చేశాడు. తర్వాత ఒక బండి తెచ్చి, బండిలో సామాన్లు పెట్టి శిష్యుడిని పిలిచి 'నాయనా! బండిలో సామాను తీసుకుని మనం కొత్త ఇంటికి వెళదాం! నేను బండి ముందు వెళుతుంటాను. నువ్వు బండి వెనుక నడుస్తూ కింద పడిపోయినవి తీసి బండిలో వేస్తూ ఉండు' అని చెప్పాడు 'అలాగే గురువుగారూ!' అన్నాడు భాస్కరం.

బండి బయల్దేరింది. ఆనందాచారి బండి ముందు వెళుతున్నాడు. భాస్కరం బండి వెనుక నడుస్తున్నాడు. బండి కొత్త ఇంటికి చేరుకుంది. సామాను దింపుదామని ఆనందాచారి వెనక్కు వచ్చి చూస్తే బండిలో సామాను నిండా పేడ ముద్దలు వేసి వున్నాయి. శిష్యుడిని పిలిచి 'ఇదేమిట్రా భాస్కరం! బండిలో సామాను మీద పేడ వేశావు?' అని అడగ్గా భాస్కరం అమాయకంగా 'గురువుగారూ! మీరే కదా కింద పడిపోయినవి తీసి బండ్లో వేయమన్నారు. దారి పొడవునా బండికి కట్టినఎద్దు పేడ కింద పడిపోతున్నదండీ, అందుకే తీసి బండిలో వేశానండీ' అని బదులిచ్చాడు.

శిష్యుడి అమాయకత్వానికి జాలిపడాలో, సామాను పాడైపోయినందుకు బాధపడాలో ఆనందాచారికి అర్థం కాలేదు. పాడైపోయిన సామాను పాడైపోయినందుకు బాధపడాలో ఆనందాచారికి అర్థం కాలేదు. పాడైపోయిన సామాను అంతా కడిగి శుభ్రం చేసే ప్రయత్నంలో పడ్డాఉ ఆనందాచారి.

కథలోని నీతి: పెద్దలు చెప్పిన విషయంలో అర్థానిన చక్కగా గ్రహించి పనిచేయాలే తప్ప తెలివి తక్కువ పనులు చేయరాదు.

పిల్లలూ ఈ తల్లీ పిల్లల్ని కలపండి చూద్దాం... ఇక్కడున్న బొమ్మలను జతచేయండి



## దారిని చూపండి




ఈ జంతువులన్నీ బయటకు వెళ్ళి జూకి వెళ్ళే దానికి మర్చిపోయాయంట ఈ జంతువులకి జూలోకి ఎలా వెళ్ళాలో దారిని చూపించండి




## తేడాలు గుర్తించండి

పిల్లకాయలు ఈ బొమ్మల్లో తేడాలని గుర్తిద్దామా!





## రంగులు వేయండి

పిల్లలూ ఈ గుర్రానికి దాని పిల్లకు మంచి రంగును చూసి వేయండి



## చుక్కలు కలపండి

బుడ్డి బుడ్డి పిల్లలూ మీకు ఎ,బి,సి,డిలు తెలుసా అయితే కలపండి చూద్దాం






ఇతరులు మనల్ని ఎలా గౌరవించాలని కోరుకుంటామో, ఇతరుల్ని మనం అలాగే గౌరవించాలి - షేక్స్పియర్

## క్రైం స్టోరీ

# వెట్టిచాకిరీలో చిట్టిచేతులు

ఖరీదైన హోటళ్ల దగ్గర నుంచి రోడ్డుపై మెకానిక్ షాపుల వరకు బాల కార్మికులతో పనులు చేయిస్తున్నారు. లేత భుజాలపై పెనుభారం మోపుతూ వారి బతుకులను ఛిద్రం చేస్తున్నారు. తాము అధికారంలోకి వస్తే నిర్బంధ విద్య ప్రవేశపెడతామన్న నేతలు బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనపై శ్రద్ధ చూపడం లేదు. వెరసి బాలకార్మికుల సంక్షేమం కేవలం ప్రకటనలకే పరిమిత మైంది. కేంద్ర, రాష్ర ప్రభుత్వాలు బాల కార్మికుల నియంత్రణకు అమలు చేస్తున్న చట్టాలన్నీ అధికారులల్లో చిత్తశుద్ధి లేని కారణంగా నిర్వీర్యమవుతున్నాయి. 1986 చైల్డ్ లేబర్ యాక్టును పూర్తిస్థాయిలో అమలు చేయడంలో విఫలమవుతున్నారు. ఎంతో ప్రతిష్మాత్మకంగా భావించే 'రైట్ కంపల్‌సరీ ఎడ్యుకేషన్ యాక్టు 2009' అమలు కూడా అంతంత మాత్రమే అమలవుతోంది. కేంద్ర ప్రభుత్వం అమల్లోకి తెచ్చిన కొత్తచట్టం ప్రకారం 6సంవత్సరాల నుంచి 14సంవత్సరాల వయస్సు కలిగిన బాలికలు, బాలురు చదువు కోవాలని ఈ చట్టం ప్రధాన ఉద్దేశ్యం. అయితే రాష్ట్రంలో రైట్ ఎడ్యుకేషన్ యాక్టుపై గ్రామీణ ప్రాంతాలలో ప్రజలకు సరైన అవగాహన కొరవడింది. బడిలో ఒడిలో పెరగాల్సిన బాల్యం చెత్తకుప్పల పాలవుతోంది. పది సంవత్సరాలు కూడా పూర్తికాని చిన్నారులు ఇటుక బట్టీలలో పనిచేస్తున్నారు. పుస్తకాలు చేతపట్టాల్సిన చిన్నారులు మట్టితట్టలు మోస్తున్నారు. బాల కార్మిక నియంత్రణకు ప్రవేశపెట్టిన చట్టాలు ఆచరణలో నిర్వీర్యం అవుతున్నాయి. తెలుగు రాష్ట్రాలలోని అన్ని జిల్లాలో కార్మిక సంక్షేమ శాఖ అధికారులు తూ.తూ మంత్రంగానే తనిఖీలు చేపడుతున్నారు. దాదాపు అన్ని జిల్లాల్లో ఇటుక బట్టీల్లో చిన్నారులతో పనులు చేయిస్తున్నారు. ప్రమాదకరమైన పరిశ్రమల్లో బాలకార్మికులతో పనులు చేయించుకుంటున్నారు. ప్రభుత్వం నిషేధించి ప్రమాదకర పరిశ్రమలు, బ్రాందీ షాపులలో, బారుల్లో సైతం చిన్నారులే దర్శనమిస్తున్నారు. బాలకార్మికులతో బండ చాకిరి చేయిస్తున్నారు. జిల్లా కేంద్రాలు, రాష్ట్ర రాజధానిలో సైతం పెద్దపెద్ద హోటళ్ల, ప్రైవేట్ సంస్థల్లో బాలకార్మికులే కనిపిస్తున్నారు. వీరిలో అతితక్కువ వేతనాలు చెల్లించి చేతులు దులుపుకుంటున్నారు. ఇదిలా వుంటే ఆదివారాలు, ప్రభుత్వ సెలవు దినాల్లో ప్రైవేట్ సంస్థలు అనధికారికంగా పనిచేస్తున్నాయి. వీటిల్లో అధికంగా బాలకార్మికులు ఉంటున్నారు. బడి బయట 14సంవత్సరాల లోపు పిల్లల్ని పాఠశాలకు పంపించడంలో సంబంధిత అధికారులు శ్రద్ధ చూపడం లేదు. ఫలితంగా ప్రభుత్వాలు అమలు చేస్తున్న ఉచిత నిర్బంద విద్య ఆచరణలో అపహాస్యం పాలవుతోంది. బాల కార్మికులకు విముక్తి కల్పించాలని ప్రభుత్వాలు ప్రవేశపెట్టిన సంక్షేమ పథకాలు కాగితాలకే పరిమితమా? అని జిల్లాల వారీగా బాలకార్మికుల తీరు తెన్నులు చూస్తే ఇట్టే అర్థమవుతోంది. 15సంవత్సరాల లోపు పిల్లలతో పనిచేయిస్తే బాలల ఉద్యోగ సవరణ చట్టం ప్రకారం 1970 చట్టం ప్రకారం శిక్షార్హులు. 1954 చట్టం ప్రకారం 17సంవత్సరాల వయస్సులోపు వయస్సు కలిగిన వారితో కర్మాగారాల్లో పని చేయించడం నేరం. ప్రభుత్వం ప్రవేశపెట్టిన చట్టాల ప్రకారం 18సంవత్సరాలలోపు వయస్సున్న ప్రతీ ఒక్కరూ బాలలే. వారితో పనిచేయిస్తే వారి హక్కులను హరించడమేనని చట్టాలు స్పష్టంగా పేర్కొంటున్నాయి. బాలల హక్కుల పరిరక్షణ చట్టం 1986 ప్రకారం ప్రమాదకర ప్రదేశాల్లో బాలలతో పని చేయించుకోవడం నేరమే. బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనకు 'వె లుగు' లాంటి పథకాలు అమలు చేసింది. బాలల సంక్షేమం కోసం అమలు చేస్తున్న పథకాలు సత్ఫలితాలు ఇవ్వలేకపోతున్నాయి. నిషేధిత ప్రాంతాల్లో పనిచేసే బాలలను గుర్తించి వారికి పునరావాసం కల్పించడంలో అధికారులు తరచూ విఫలమవుతున్నారు. పాఠశాలకు వెళ్లని చిన్నారులు, చెడు వ్యసనాలకు లోనవుతున్నారు. విలువైన బాల్యం బుగ్గిపాలవుతోంది. పేదరికం వల్ల తల్లి.తండ్రులు తమతో పాటు పిల్లలను భవన నిర్మాణాలు, ఇతర పనులకు వెంట తీసుకెళుతూ వారిని కూలీలుగా తీర్చుదిద్దుతున్నట్లు ఒక సర్వేలో వెల్లడైంది. ప్రమాదకర ప్రాంతాల్లో పనిచేసే బాల కార్మికులకు విముక్తి కల్పించాల్సిన అధికారులు నిమ్మకునీరెత్తినట్లు వ్యవహరిస్తున్నారు. ప్రభుత్వాలు బాల కార్మికుల సంక్షేమానికి వెచ్చించే నిధులు బూడిదలో పోసిన పన్నీరులా మారుతోంది. ప్రభుత్వాలతోపాటు తెలుగు రాష్ట్రాలలోని కొన్ని స్వచ్ఛంద సంస్థలు కూడా బాలకార్మికుల సంక్షేమానికి కృషి చేస్తున్నట్లు ప్రచారం చేస్తున్నారు. ఎంతో ఉన్నతాశయంతో ప్రవేశపెట్టిన ఉచిత నిర్బంధ విద్య చట్టాలను జిల్లా కలెక్టర్లు సక్రమంగా అమలు చేసేందుకు కృషి చేయాల్సి ఉంది. రైట్ టు కంపల్‌సరీ ఎడ్యుకేషన్ యాక్టు 200 పటిష్టంగా అమలు చేయాల్సిన అధికారులు మొక్కుబడిగా పనిచేస్తున్నారనే విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. ఉత్తర తెలంగాణ జిల్లాల్లో బాల కార్మికులు ఇటుకబట్టీలు, క్వారీలు, మద్యం దుకాణాల్లో పనిచేస్తున్నారు. కొందరు అధికారుల ఇళ్లలో కూడా బాలకార్మికులే దర్శనమిస్తున్నారు. చట్టాలను అమలు చేయాల్సిన అధికారులే నిబంధనలకు విరుద్దంగా తమ ఇళ్లో బాల కార్మికులతో పనులు చేయించుకోవడం విచారకరం. కంచే చేను మేసిన చందాన బాల కార్మికుల చట్టాలను అమలు చేయాల్సిన అధికారులు కొందరు అమ్యాయ్యాలకు అలవాటు పడి చూసీ చూడనట్లు వ్యవహరించడం వల్లే తెలుగు రాష్ట్రాలలో బాల కార్మికుల సంఖ్య రోజురోజుకు గణనీయంగా పెరుగుతోంది. రాష్ట్ర రాజధానిలో సచివాలయం సమీపంలోని హోటళ్లలో బాలకార్మికులు పనిచేస్తున్న దృశ్యాలు బాల కార్మిక చట్టాన్ని అపహాస్యం చేసే విధంగా ఉన్నాయి. 14ఏళ్లలోపు బాలికలు సైతం బడాబాబుల ఇళ్లల్లో పనిచేస్తున్నారు. బాల కార్మికుల సంక్షేమానికి ప్రభుత్వాలు అమలు చేసే పథకాఅమలులో పాలకుల ఉదాసీన వైఖరి వల్ల ఆచరణలో బాల కార్మికుల సంక్షేమం కేవలం ప్రకటనలకే పరిమితమవుతుండటం గమనార్హం. తెలుగు రాష్ట్రాలలో బాల కార్మికులతో వెట్టిచాకిరి చేయించుకునే వారిపై చర్యలు అంతంత మాత్రంగా ఉంటున్నాయి. ఇంత వరకు బాలకార్మికులతో పనిచేయించుకన్న వారికి కఠిన శిక్షలు పడిన దాఖలాలు లేవు. ప్రమాదకర ప్రదే శాల్లో పనిచేసే బాల కార్మికులను గుర్తించి ప్రభుత్వ నిబంధనలను భేఖాతరు చేస్తున్న యాజమాన్యాలపై చట్టపరంగా చర్యలు తీసుకోవాలని వామపక్ష పార్టీల అనుబంధ సంఘాలు గతంలో అనేక ఉద్యమాలు నిర్వ హించిన విషయం విధితమే. బాలకార్మికులకు పునరా వాసం కల్పిస్తున్నట్లు ప్రభుత్వ అధికారుల కాకిలెక్క లతో సరిపెడుతున్నారు. గతంలో పాఠశా లలకు వెళ్లేవారినే ప్రభుత్వ లెక్కల్లో పేర్కొంటున్నారు.





చెన్నూరి నాగశ్రీధరశర్మ,
సీనియర్ జర్నలిస్టు

## తూర్పు-పడమర

# దేవతల ప్రతిష్టకు శుభ శకునాలు



మంత్ర దీక్ష

- మంచి తీర్థంలో, సూర్య, చంద్ర గ్రహణాల్లో, పుణ్య ప్రదాలైన అరణ్యాల్లో, మాస, నక్షత్రాది విచారణ అవసరం లేదు. దీక్ష ప్రారంభించవచ్చు.
- గురువు సంతోషించిన రోజున వారాలు, గ్రహాలు, నక్షత్రాలు, రాశులు అన్నీ మంచివే. గురువు సంతోషిస్తే, దేవతల అనుగ్రహం అభిస్తుంది. మోక్షేచ్ఛగల వారికి, స్త్రీలకు కాల నియమం లేదు.
- కార్తీక, అశ్వయుజ, వైశాఖ, మాఘ, మార్గశీర్షాలు, ఫాల్గుణ శ్రావణాలు మంత్ర పురశ్చరణకు మంచివి. ఆది, బుధ, గురు, శుక్ర వారాలు ఉత్తమాలు. శనివారం, మృత్యువు, సోమవారం మధ్యమం, విష్ణు మంత్రాలకు స్థిర లగ్నం శివ మంత్రాలకు చరలగ్నం, దేవీ మంత్రాలకు ద్విస్వ భావ లగ్నం ఉత్తమమైనవి.
- పర్వతాగ్రంపైన, నదీతీరంలోను, మారేడు చెట్లు మొదట్లో, జలాశయం వద్ద, గోశాలలో, దేవాలయంలో, రావి చెట్టు మొదట, ఉద్యానవనంలో, తులసీ వనంలో, గురువు గారి వద్ద, పుణ్యక్షేత్రంలో, మనుసుకు ఏకాగ్రత కలిగిన స్థలంలో, పురశ్చరణ చేస్తే మంత్రం సిద్ధిస్తుంది.
- జ్యేష్ట, ఆషాఢ, భాద్రపద, పుష్య, మలమాసాలు, మంగళ, శనివారాలు, వ్యతీపాత, వైధృతీ, యోగాలు, అష్టమి, నవమి, షష్టి, చవితి, త్రయోదశి, చతుర్ధశి, అమావాస్య, ప్రదోషం, రాత్రి, భరణి, ఆర్ధ్ర, ఆశ్రేష, జ్యేష్ట, ధనిష్ట, శ్రవణం జన్మనక్షత్రం, మేషం, కర్కాటకం, తుల, కుంభం, మకర లగ్నాలు విడువదగినవి.
- చంద్రబలం, తారాబలం, అనుకూలంగా చూసుకుని శుక్లపక్షంలో పురశ్చరణ చేయాలి.
- శివుని స్థానంలో పడమటకు తిరిగి జపం చేయాలి. ప్రారంభించిన రోజు నుంచి పూర్తి చేసే రోజు వరకు హెచ్చు తగ్గులు లేకుండా ప్రతి రోజు జపం చేయాలి.

దేవీ పర్వాలు

- భాద్రపద షష్టి, అశ్వయుజ బహుళ చతుర్ధశి, కార్తీక శుద్ధ నవమి, మార్గశిర బహుళ పంచమి, పుష్య పూర్ణిమ, మాఘ, (శుద్ధ) చవితి, ఫాల్గుణ బహుళ ఏకాదశి, చైత్ర, (బహుళ) త్రయోదశి, వైశాఖ (శుద్ధ) తదియ (అక్షయ తదియ) జ్యేష్టంలో దశహర దశమి (శుక్ల పక్షం), అషాడంలో బహుళ ద్వాదశి, శ్రావణంలో అమావాస్యలు– దేవీ పర్వాలు. ఇవి మంత్ర జపానికి మంచివి. ఇవి కోటి యజ్ఞ ఫల ప్రదాలు.
- అమావాస్యాంత పద్ధతిలో చాంద్ర మాసాల్లో చైత్ర శుద్ధ త్రయోదశి, చతుర్ధశి, వైశాఖ శుద్ధంలో తదియ, ఏకాదశి, పూర్ణిమ, కృష్ణ పక్షచతుర్ధశి ఆషాఢ శుద్ధంలో పంచమి, త్రయోదశి, శ్రావణ మాసంలో శుద్ధ ఏకాదశి, చతుర్ధశి, కృష్ణ పక్షంలో అష్టమి, రోహిణీ నక్షత్రయుక్తమైనది, భాద్రపదంలో బహుళ నవమి షష్టీ, అష్టమి, రోహిణీయుతమైనది, అశ్వయుజ శుద్ధ సప్తమి, అష్టమి, కృష్ణ పక్షంలో చతుర్ధశి కార్తికంలో శుద్ధ నవమి, ద్వాదశి మార్గశీర్ష శుద్ధంలో తదియ, షష్టీ, పుష్య శుద్ధ చవితి, నవమి, చతుర్ధశి, బహుళ దశమి, మాఘ శుక్ల పక్షంలో చవితి, ఏకాదశి బహుళ చతుర్ధశి, ఫాల్గుణ, శుద్ధంలో షష్టీ, నవమి, బహుళంలో ఏకాదశి దేవీ పర్వాలు, దేవీ మంత్ర జపాలకు చాలా శ్రేష్టమైనవి.

శాస్త్రం చాలా విస్తృతమైనది. దాన్ని పరిశీలించడం, వాటి ఫలితాలను గుర్తించడం వాటి ఫలితాలను అనుభవంలో సరిపడుతున్న వాటిని గమనించడం, సత్యాంశ నిర్ధారణ జ్యోతిష్యుని కర్తవ్యాలు.

–సుసర్ల బాబురావు
ఎం.ఏ (ఆస్ట్రాలజీ)

## జాతకం

# ఉపనయనము గురించి వివరించండి?

వీరికి పరిస్థితులు అనుకూలంగా లేనపడు ఎంతకాల మైనను ఓర్పు వహించి ఉండ గలరు. వీరు ఎవరికిని అపకారం చేయరు. ప్రవ ర్తన ఒక్కొక్కసారి అతి కఠినంగా, మరొక్క సారి మెత్తగా ఉంటుంది. ముసలితనం వరకు శరీ రము, మనస్సు చురుకుగా ఉంటాయి. ఆపద లను మన స్సుకు పట్టించుకోరు. ఎంతటి ఆప దలో ఉన్నా ఆ ఆపద ను తప్పించుకోగల నేర్పు కలిగి ఉందురు.

కార్యసాధనకై ఎంతటి కష్టాలనైనను అనుభ వించగలరు. వీరికి నచ్చని విషయాలలో ఏ మాత్రం కృషి చేయరు. అలాగే నచ్చనివారిని దగ్గరకు రానీయరు. తప్పు చేసినవారు తన వారైనా శిక్షించడానికి వెనుదీయరు. మంచి వాగ్ధాటి, హాస్యకుశలత అధికంగా ఉంటుంది. 25 సంవత్సరాలలోపు కుటుంబ సంబంధమైన కష్టాలుంటాయి. వీరి జీవితంలో ద్వితీయార్థం బాగుంటుంది. వీరు రెండు మూడు ఆదాయ మార్గాలు కలిగి ఉంటారు.

వీరికి దయాగుణం అధికంగా ఉంటుంది. ప్రత్యుపకారం ఆశించకుండా విధి నిర్వహణగా తలచి మంచి పనులు, ఉపకారాలు చేస్తారు. ఇతరులు తక్కువ ఉపకారం చేసినా వీరికి వీరు ఎక్కువగా ఉపకరిస్తారు. వీరు భోగాలు అనుభ వించడానికి ప్రాముఖ్యం ఇవ్వరు. ఇతరులకు వీరి ప్రవర్తన మిక్కిలి కఠినంగా కనిపిస్తుంది. ఎదుటివారి తపను క్షమిస్తారు గాని, వీరిని చూస్తే అలా క్షమించేవా రిలా కనిపించరు. ధైర్యంగా కనిపించినా మానసికంగా కొంత పిరికితనం ఉంటుంది. ఇతరులు బాధపడు తుంటే వీరి మనస్సు కరిగిపోతుంది. ప్రతి పని యందు జాగ్రత్త అధికం. తమ పనిలోని నైపు ణ్యం ఎదుటివారికి చూపాలి అనే ఆసక్తి ఉం టుంది. ఒకే పనిని ఇతరులు చేసిన దానికంటె గొప్పగా చేయగలరు. పలురకములైన వైజ్ఞాని కాంశములలో పాండిత్యము, నేర్పు కలిగి ఉం టారు. ఎట్టి వాతావరణంలోనైనా చక్కగా సర్దు కొనిపోగలరు.

వీరికి ఏకాగ్రత, పట్టుదల అధికంగా ఉం టుంది. లక్ష్యసాధనలో నియమ ప్రకారం ప్రవ ర్తించి లక్ష్యం సాధిస్తారు. వీరికి అభిమా నం ఎక్కువ. లౌక్య ప్రవర్తన వీరికి తెలి యదు. సూటిగా ప్రవర్తించినందు వలన కొందరితో వైరుధ్యములు ఏర్ప డతాయి. వీరు సక్రమంగా ప్రవర్తిస్తారు కాబట్టి, అందరూ అలాంటివారే అని భావించినం దువలన ఇతరుల చేతిలో మోసపోయే అవకాశం ఉంది. మోసం బయట పడితే వీరు ప్రారం భిం చిన కార్యక్రమం సైతం మధ్యలో విడిచిపెడ తారు. ఏ పని ప్రారంభించినా సక్ర మంగా సాగినంత వరకు చాలా త్వరి తంగా కార్యం సాధిస్తారు. కాని ఏ ఒక్క రూ సహకారంలో లోపం చేసినా చిరా కు పడతారు. నిబంధనలు అధికంగా పెట్టుకుంటారు. దుష్ట ప్రవర్తన చూచి సహించలేక వారితో కలహిం చుట వలన చాల మందికి దూరం అవుతారు. న్యాయ ప్రవర్తన గూర్చి చిన్న చిన్న విషయాలలో అధికమైన పట్టు దల చూపిస్తారు. వీరికి తాత్కాలికోద్రేకం, కోపం ఎంత త్వరితంగా వస్తుందో, అంత త్వరితంగానే శాంతి స్తారు. కీర్తి కాంక్ష ఇతరులు తన ప్రవర్త నను, గొప్ప దనమును మెచ్చుకోవాలనే కాంక్ష అధికంగా ఉంటుంది. ఓటమిని వీరు అంగీకరిం చరు. మనసులో బాధలు ఉన్నా ఓర్పుతో, నిగూ ఢంగా ఉంటారు. తమ కష్టాలు ఇతరులకు తెలి యని వ్వరు. వీరి ఆర్థిక స్థితి ఉన్నదానికంటె అధి కంగా ప్రదర్శించడం వలన పలువురు వీరిని ఆశ్రయిస్తారు.

వీరు ఇతరులకు ఆశ్రయం ఇచ్చినందువలన కొన్ని చిక్కుల నెదుర్కొంటారు. వీరికి స్థైర్యం తక్కువ. నిలిచినచోట నిలువకుండా ఎంతపని నైనా చేయగలరు. కాని, కూర్చునిచేసే పనుల యందు ఇష్టం తక్కువగా ఉంటుంది. క్రొత్త క్రొత్త పనులలో క్రొత్త మనుషులతో పనులు సక్రమంగా చేయగలరు. ఇతరులకు ఉపదేశిం చుటలో మిక్కిలి నేర్పు కలిగి ఉందురు. విశే షించి వాదనాపటిమ అధికంగా ఉంటుంది. చక్కని శరీరాకృతిని కలిగి శక్తివంతములైన శరీ రావయవములతో ఉంటారు. వ్యాయామం, ఆహార నియమం వీరికి చాలా అవసరం. ఆహార నియమం లేకపోతే జీర్ణకోశ వ్యాధు లు కలిగే అవకాశం ఉంది. అలాగే శరీరం స్థూలమయ్యే అవకాశం ఉంది. వీరి ఆలోచనలలో దాపరికం ఉండదు. మనసులోని మాటను ధైర్యంగా వ్యక్తీ కరిస్తారు.

**పేరు:** హేమంత్‌కుమార్, **పుట్టిన తేది:** 30-10-1967
**పుట్టిన సమయం:** రాత్రి 9-15, **పుట్టిన ఊరు:** వరంగల్
**ప్రశ్న:** నేను కెనడ వీసాకి అప్లై చేసినాను, కెనడాకి ఎప్పుడు వెళ్తాను. దయచేసి చెప్పండి. నేను ప్రస్తుతం నైజీరియాలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పని చేస్తున్నాను.

ప్రస్తుతం బాగానేవుంది. మీ ఆశలు నెరవేరే సమయం ఆసన్నమైంది.

**పరిహారాలు:-** పుష్యరాంగం మీ చేతికి ఉంటే తీసెయ్యండి - డైమండ్ (11 సెంట్స్) ఎడమచేతి మధ్య వ్రేలికి శుక్రవారం ఉ। 6 గం॥లకు ధరించండి.

మీ సందేహాలని క్లుప్తంగా (మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ....................................
పుట్టిన తేదీ : ....................................
పుట్టిన సమయం : ..............................
పుట్టిన ఊరు (మండలం) : ..................
ప్రశ్న : ....................................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

'జాతకం' 'సూర్య' ఆదివారం
**SPR publications, Surya Soudha, Plot.No: 185, M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar, AyyappaSociety Opp: Hi-Tech City, Hyderabad - 500 072.**

## 19-2-2017 నుండి 25-2-2017 రాశిఫలం



**మేషం: Aries** ( అశ్విని, భరణి, కృత్తిక - 1) :
పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. గృహంలో నోములు, వ్రతాలు జరిపిస్తారు. పండితులను సత్కరిస్తారు. భార్యకు అనారోగ్యం కలుగుతుంది. వృత్తివ్యాపారాల్లో ప్రభుత్వ అధికారుల వలన ఇబ్బందులు ఎదు ర్కొంటారు. ఆరోగ్య విషయంలో ప్రత్యేక శ్రద్ధ అవసరం. కోర్టు సమస్యల నుండి విముక్తి లభిస్తుంది.



**వృషభం: Taurus** (కృత్తిక - 2,3,4, రోహిణి, మృగశిర - 1,2)::
బంధువులతో విభేదాలు. నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలు వస్తాయి. విద్యార్థుల ఉన్నతవిద్య కొరకు ప్రభుత్వ ఋణం లభిస్తుంది. వివాహ ప్రయత్నాలు వాయిదా పడతాయి.



**మిథునం: Gemini** (మృగశిర -3,4,
వ్యక్తిగత ఆరోగ్య విషయంలో ప్రత్యేక శ్రద్ధ అవసరం. అజీర్ణ సంబంధ వ్యాధులు ఇబ్బంది పెడతాయి. న్యాయవాదులు, వైద్యులు సహకరిస్తారు. సాహసమైన వృత్తులలో ఉన్నవారు, రవాణా శాఖలోని వారు, వాహనాలు వేగంగా నడిపేవారు తగు జాగ్రత్తలు తీసుకోవడం మంచిది.



**కర్కాటకం: Cancer**(పునర్వసు -4,
వ్యాపారస్తులు ప్రత్యర్థుల కన్నా ముందుండి లాభాలు సంపాదిస్తారు. నిరుద్యోగులు, విద్యార్థులు పోటీ పరీక్షల్లో విజయం సాధిస్తారు. ఆరోగ్య విషయంలో ప్రత్యేక శ్రద్ధ అవసరం. కోర్టు సమస్యల నుండి విముక్తి లభిస్తుంది.



**సింహం: Leo** (ముఖ, పుబ్బ, ఉత్తర -1):
మీకు అత్యంత ఆప్తుడైన వ్యక్తి ప్రమాదంలో చిక్కుకుంటాడు. స్నేహితులతో విరోధం వస్తుంది. ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో అన్న సందిగ్ధంలో పడతారు. భార్యకు అనారోగ్యం కలుగుతుంది.



**కన్య: Virgo** ( ఉత్తర - 2,3,4, హస్త, చిత్త -1,2)::
గుప్తధనం లభిస్తుంది. కుటుంబ సమస్యలు ఎక్కువగా ఉంటాయి. బంధువులతో విరోధం కలుగుతుంది. బంధువులు దూషణకు గురి అవుతారు. ఋణ ప్రయత్నాలు ఫలిస్తాయి. పొదుపు చేసిన ధనం ఖర్చు చేయవలసి వస్తుంది.



**తుల: Libra** (చిత్త -3,4, స్వాతి, విశాఖ -1,2,3)
ఆకస్మిక ధనలాభం. గుప్త ధనం లభిస్తుంది. ఇన్సూరెన్సుల ద్వారా ధనం చేతికి అందుతుంది. భాగస్తులు శత్రువులతో చేరి మీ పతనం కొరకు మంతనాలు చేస్తారు. కుటుంబ వ్యవహారాల్లో ఇతరులు జోక్యం చేసుకుంటారు.



**వృశ్చికం: Scorpio** (విశాఖ -4 అనూరాధ, జ్యేష్ఠ)
విద్యార్థులు విద్య కొరకు దూరప్రాంతాలకు వెళ్ళవలసి వస్తుంది. అనవసర ఆవేశాలకు, కోపానికి గురవు తారు. మీ ఆత్మీయులలో ఒకరు ప్రమాదానికి గురి అవుతారు. భూమికి సంబంధించిన వివాదాలు ఎదు ర్కొంటారు.



**ధనుస్సు: Sagittarius** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ -1):
గృహనిర్మాణం కొరకు స్థలం సమకూర్చుకుంటారు. స్థానచలనం కొరకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. పిల్లల చదువు కొరకు ఎక్కువ ధనం ఖర్చు చేయవలసి వస్తుంది. చెడు వ్యసనాలపై కోరిక కలుగుతుంది.



**మకరం: Capricorn** (ఉత్తరాషాఢ -2,3,4, శ్రవణం, ధనిష్ఠ -1,2):
అధిక ఒత్తిడి ఉంటుంది. కంప్యూటర్ రంగంలో వారికి, ఆర్థిక రంగంలో ఉన్నవారికి మంచి అవకాశాలు లభిస్తాయి. విదేశీ ప్రయత్నాలు ఫలిస్తాయి. చర్మసంబంధ వ్యాధులు బాధిస్తాయి. అనవసర ప్రయాణాలు విసుగు కలిగిస్తాయి.



**కుంభం: Aquarius** (ధనిష్ఠ-3,4, శతభిష, పూర్వాభాద్ర- 1,2,3
భాగస్వామ్య ఒప్పందాలు రద్దుచేసుకోవడం మంచిది. దూరప్రాంత ప్రయాణాలు చేసేటప్పుడు జాగ్రత్త వహించాలి. భూ వివాదాలు పరిష్కారం అవుతాయి. కుటుంబ సభ్యుల నుండి ప్రోత్సాహం లభిస్తుంది. నూతన ప్రయత్నాలు నిదానంగా పూర్తి అవుతాయి.



**మీనం: Pisces** (పూర్వాభాద్ర -4,
కేసులు పరిష్కారం అయ్యే సూచనలు కనిపిస్తాయి. సంఘసేవా కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటారు. సన్నిహితులతో కలిసి విందువినోదాల్లో పాల్గొంటారు. సంతానం కొరకు అధికంగా ఖర్చు చేయవలసి వస్తుంది. వాహనాలు, స్థలాలు కొనుగోలు చేస్తారు. సంఘంలో గౌరవం పెరుగుతుంది.



నిద్రపోయి కలగన్నాను బ్రతుకంతా సుందరమని. మేలుకొని కనుగొన్నాను బ్రతుకు పెద్ద బాధ్యత అని. -గొథె

## ఆలయం

# జంబుకేశ్వరుడు



జంబుకేశ్వరానికి తిరువనైకావల్, తిమేవకాయ్ అనే పేర్లు కూడా ఉన్నాయి. వీటి ప్రకారం ఇక్కడ ఏనుగుల చేత పూజలందుకొన్న క్షేత్రం అని అర్థం. పూర్వం ఇక్కడ అధికంగా జంబు వృక్షాలు ఉండడం వల్ల దీనికి జంబుకేశ్వరం అని పేరు వచ్చింది. జంబు వృక్షాలంటే తెల్లనేరేడు వృక్షాలు. దేశంలోని పంచభూత క్షేత్రాలలో ఇక్కడ కొలువై ఉన్నది జల లింగం కాగా మిగతావి... చిదంబరం (ఆకాశలింగం), కాంచీపురం (భూ లింగం), శ్రీ కాళహస్తి (వాయులింగం), తిరువన్నామలై (అగ్ని లింగం). వీటిలో మనరాష్ట్రంలోని శ్రీకాళహస్తి కాకుండా పంచభూత క్షేత్రాల్లోని మిగతా నాలుగు తమిళనాడులోనే ఉండడం గమనార్హం. ఈ క్షేత్రం స్థల పురాణ విషయానికి వస్తే... ఇక్కడ స్థల పురాణం పై రెండు కథలు ప్రాచుర్యంలో ఉన్నాయి.

**మొదటి ఇతిహాసం...**మొదటి కథ ప్రకారం ఇక్కడ శంభుడు అనే ఋషి నివసిస్తుండేవాడు. ఆ ఋషి అత్యంత శివభక్తుడు. శివుడిని పూజించందే మంచినీరు కూడా స్వీకరించేవాడు కాదు. అలా కాలం గడుస్తుండగా ఒకసారి శంభుడికి శివుడిని ప్రత్యక్షంగా పూజించాలని కోరిక కలిగింది. ఆ విధంగా శివుడిని ప్రసన్నం చేసుకోవడానికి తపస్సు చేయనారంభిం చాడు. శివుడు అతని తపస్సుకి మెచ్చి ప్రత్యక్షం అయి వరం కోరుకోమనగా శంభుడు తన అభీష్టం అయినా ప్రత్య క్షంగా పూజించే వరం కోరుకునాడు. భోళా శంకరుడు అంగీకరించి "ఇక్కడ లింగ రూపంలో వెలుస్తాను, నువ్వు జంబు వృక్ష రూపంలో ఉండి నన్ను పూజించు" అని చెప్పి అంతర్ధానం అయ్యాడట. శివుడు శంభుడికి ఇచ్చిన వరం ప్రకారం లింగంగా ఆవి ర్భంచగా శంభుడు జంబు వృక్షమై శివుడిని అర్చిస్తుం టాడు. ఆలయ ప్రాంగణంలో ఉన్న జంబువృక్షమే శంభు డని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

**మరో ఇతిహాసం ప్రకారం...**ఇక్కడ స్వామి వారిని ఏనుగు, సాలెపురుగు పోటిపడి పూజిస్తుండేవి. సరిగ్గా శ్రీకాళహస్తి స్థలపురాణానికి సన్ని హితంగా ఉండే ఇతిహాసం ఇక్కడ కూడా వినిపిస్తుంది.

> పంచభూత క్షేత్రాలలో రెండవది జంబుకేశ్వరం. దేశంలోనే అతిపెద్ద, విశాలమైన దేవాలయంగా పేరుగాంచింది ఈ శైవక్షేత్రం. ఇక్కడ కొలువై ఉన్నది జల లింగం. జంబుకేశ్వరం తమిళనాడు రాష్ట్రంలోని తిరుచురాపల్లి జిల్లా కేంద్రానికి 3 కిలోమీటర్ల దూరంలో ఉన్నది. ఈ దేవాలయంలో మూర్తి జంబుకేశ్వరస్వామిగా ప్రసిద్ధి. ఈ స్వామికి దేవేరి అఖిలాండేశ్వరి పేరుతో విరాజిల్లుతోంది.

జంబుకేశ్వరం పవిత్ర కావేరి నది ఒడ్డున ఉన్నది. స్థానికులు ఈ నదిని 'పొన్ని' అని పిలుస్తారు. తమి ళంలో పొన్ని అంటే 'బంగారం' అని అర్థం. ఇక్కడ కావేరి నదిలో స్నానం ఆచరించడం జంబుకేశ్వరుడిగా వెలసిన శివుడిని కొలవడం చాలా శ్రేష్ఠం అని ఇక్కడ స్థానికుల నమ్మకం.

**ఆలయం విశేషాలు...**ఇక్కడి దేవాలయం విశాలమైన ప్రాకారాలతో ఎత్తైన గోపురాలతో ఉన్నది. దేవాలయం ఐదు ఎక రాల విస్తీర్ణం, ఐదు ప్రాకారాలు కలిగి ఉన్నది. ఆలయానికి మొత్తం ఏడు గోపురాలు ఉన్నాయి. జంబుకేశ్వర స్వామి వారు పశ్చిమాభిముఖంగా ఉన్నారు. గర్భగుడి ప్రక్కన అఖి లాండేశ్వరి ఆలయం కూడా ఉన్నది. ఆలయ ప్రాకారంలో జంబుకేశ్వర స్వామి ఆలయం, అఖిలాండేశ్వరి ఆలయమే కాకుండా అనేక ఉపాల యాలు, అనేక మండపాలు ఉన్నాయి.

**గర్భ గుడి...** జంబుకేశ్వ రుడిగా పేరుపొందినప్ప టికీ ఇక్కడి లింగం నీటితో నిర్మితమైంది కాని నీటిలో లేదు. లింగం పానపట్టం నుండి ఎల్లకాలం నీరు ఊరుతూ ఉంటుంది. ఈ విషయం భక్తులకు చూపించేందుకు లింగం పానపట్టం పై ఒక వస్త్రం కప్పుతారు. కొంతసేపటికి దానిని తీసివేసి ఆ వస్త్రాన్ని పిండుతారు. ఆ పిండిన వస్త్రం నుండి నీరు వస్తుంది. గర్భగుడిలో గవాక్షానికి నవద్వార గవాక్షం అని పేరు. గర్భాలయంలో ఉన్న జంబుకేశ్వరుడినే అప్పు లింగేశ్వరుడు, నీర్ తిరళ్నాథర్ అని కూడా పిలుస్తారు.

**అఖిలాండేశ్వరి ఆలయం...**జంబుకేశ్వరస్వామి దేవేరి అఖిలాండేశ్వరి అమ్మవారు. ఈ అమ్మవారు చతుర్భుజా లతో నిలబడిన భంగిమలో ఉంటారు, నాలుగు భుజాలలో పై రెండు చేతులతో కలువలు పట్టుకొన్నట్లు, క్రింది చేతులు అభయ హస్తంతో వరద ముద్రతో ఉన్నారు. అఖిలాండేశ్వరి అమ్మవారు పూర్వం చాలా ఉగ్రంగా ఉండేవారని శంకరా చార్యులు ఈమెను ఆరాధించి ఉగ్రాన్ని తగ్గించడానికి తప స్సు చేసి అమ్మవారిని ప్రసన్నం చేసుకొని శాంతమూర్తిగా మార్చారని చెబుతారు. అమ్మవారి ముందు కనిపించే శ్రీ చక్రాన్ని ప్రతిష్టించారని, అమ్మవారి కర్ణభూషణాలను కూడా శంకరాచార్యులవారే సమర్పించారని చెబుతారు. అమ్మవారి ఆలయానికి ఎదురుగా వినాయకుడు కొలువు దీరి ఉన్నాడు. ఇక్కడ వినాయకుడిని కూడా ఆదిశంకరులే ప్రతిష్ఠించారని ఇక్కడి వారి నమ్మకం.

**ఆలయ చరిత్ర – నిర్మాణం...** చారిత్రక ఆధారాల ప్రకారం ఈ ఆలయం శ్రీరంగంలో ఉన్న రంగనాథేశ్వర స్వామి ఆలయం కన్నా పురాతన మైనదని తెలుస్తోంది. క్రీ॥ శ॥ 11 వ శతాబ్ధంలో చోళరాజులు ఈ ఆలయాన్ని నిర్మించినట్లు, ఆ తరువాత ఆలయ నిర్వహణ పల్లవ రాజులు, పాం డ్యులు, విజయనగర రాజులు చేసినట్లు తెలుస్తోంది.



> శివ రాత్రి అనేది సాధనకు సంబంధించిన రాత్రి. ఈ రోజు యోగ సాధకులకు చాలా ముఖ్యమైన రోజు. శివుని యొక్క పూర్తి తత్వం అనుభవపూర్వకంగా మనకు స్మరణకు వచ్చేరోజు..శివ రాత్రిని వివిధ ప్రాంతాల్లో వివిధ రకాలుగా జరువుకుంటారు. శివుడి విషయంలో చాలా వరకు ఫ్లెక్సిబులిటి వుంది. అయితే యోగపరమైన సాధనలలో వున్నవారు మాత్రం శివుడిని ఒక సాధనా మార్గంగా ఎంచుకుంటారు.




# పంచభూత ఆరాధనే మహాశివరాత్రి ఉద్దేశ్యం

శివ రాత్రిని శక్తివంతంగా గడపాలి అంటే ముందు నుండే అంటే కనీసం 21 రోజుల నుండే శరీరాన్ని, మనసును,బుద్ధిని,ఒక క్రమ పద్ధతిలోకి తీసుకురావాలి. మనలో భూత శుద్ధి ఏర్పడే విధంగా మన నియమాలను ఏర్పాటు చేసుకోవాలి అప్పుడే శివరాత్రిని పూర్తి స్థాయిలో అనుభూతి చెందగలుగుతాము. మన వ్యవస్థలన్నిటిలో ప్రక్షాళన జరగాల్సిన అవసరం ఎంతో వుంది. భౌతిక, భావనా క్షేత్రాల్లో ఎన్నో మార్పులు రావాల్సి వుంటుంది. అప్పుడే మనం శివ శక్తితో అనుసంధానం కాగలుగు తాము. అలా భూత శుద్ధి జరుపుకున్నవారు ధన్యులు. భూత శుద్ధి అంటే పంచభూతాల శుద్ధి.పంచ భూతాలు అంటే భూమి,నీరు,అగ్ని,వాయువు,ఆకాశము ఈ ఐదింటి కలయికే ఈ సృష్టి అంతా.ఈ పంచభూతాల తోనే మనమూ నిర్మించబడ్డాము. ఈ పంచభూ తాలలో వుండి సృష్టిని నడుపుతున్న శక్తే శివం, ఆ శక్తే నీలోనూ ప్రవహిస్తుంది. ఎలా అయితే కరెంటు తీగలోని శక్తి వివి ధ పరికరాలకు చేరుకుంటుందో అలానే ఈ పంచభూతా త్మకమైన ప్రపంచాన్ని నడుపుతున్నవాడే శివుడు. మన ఈ పంచభూతాలతో అనుసంధానం అవగలిగితే శివుడిని చేరుకోవడం సాధ్యమవుతుంది. అందుకోసం పంచభూతా లను ప్రసన్నం చేసుకోవాలి.పంచభూతాలు ప్రసన్నమైతే, శివుడ్ని ప్రసన్నం చేసుకోవడం సాధ్యమవుతుంది. భగ వంతుడు ఈ సృష్టికి సంబంధించి చేసే పనులు ఐదు.

1.సృష్టి, 2.స్థితి, 3.సంహారము,4. తిరోధానము, 5.అను గ్రహము ఈ ఐదింటిగురించి మనకు తెలిసు. సృష్టి, స్థితి,సంహారాల గురించి ఇక్కడ చెప్పనవసరం లేదు.అయితే

తిరోధానము అనే విషయం గురించి మాత్రం మాట్లాడుకోవాల్సిన అవసరం వుంది.తిరోధానము అనే మాటకు అర్థం ఏ జీవి ఆత్మ పరిపక్వత పొందకుండా వుంటుందో ఆ జీవిని సంసార బంధంలో పెట్టి జనన మరణ చక్రంలో తిప్పుతూ వుంటాడు శివుడు దాన్నే తిరోధానము అంటారు.

ఆయా జీవులు లౌకిక విషయాల పట్ల అనురక్తితో అనుక్షణం భౌతిక విషయాలలో ఓలలాడుతుంటారు. వారికి ఒకపూట భోజనం మానేయమన్నా కష్టంగా వుంటుంది. చన్నీళ్ళతో స్నానం చేయమన్నా గండంగా వుంటుంది. కనీసపు నియమాలతో జీవించమన్నా మహా భయానకంగా వుంటుంది.వీటినుండి బయటకు వచ్చి కాస్త ప్రయత్నం చేస్తే,కనీసపు నియమాలతో,ఒక మంచి సంకల్పంతో సాధనా మార్గాన్ని పట్టకుంటే తిరోధాన అవస్థ నుండి భగవంతుడు మనలను బయటపడేస్తాడు. అలా బయటపడిన వారే భగవంతుడు చేసే ఐదు కృత్యాల్లో చివరిదైన అనుగ్రహాన్ని పొందగలుగుతాడు.

శివరాత్రి రోజు ఈ అనుగ్రహం పొందడానికి ఎక్కువ అవకాశాలు వుంటాయి.కనీసం ముందునుండే దీనికి సన్నద్ధం అయివుండనప్పటికీ ఆ ఒక్కరోజైనా ఉపవాసము, ఎంచాక్షరీ మంత్ర జపము,చేసి ఆ రాత్రి జాగరణ చేస్తే మన చైతన్యం తప్పని సరిగా జాగృతమవుతుంది. ఆ ఒక్క రోజైనా భౌతిక సుఖాలను వదిలిపెట్టి పూర్తి దైవ ధ్యానంలో గడిపేలా అన్ని ఏర్పాట్లు చేసుకోవాలి. శివరాత్రి సమయంలో మన శరీరంలో వున్న పంచభూతా లను స్వయంగా మనమే భౌతి కంగా,మానసికంగా ఆరాధన చేయాలి. అప్పుడే మనం శివ శక్తితో అనుసంధానం అవ్వగలుగుతాము.

–శ్రీకాంత్ కొణపర్తి



ఒక తెలివి తక్కువ స్త్రీ ఒక తెలివైన పురుషుణ్ని అదుపులో పెట్టవచ్చు. కాని అతి తెలివైన స్త్రీని అదుపులో పెట్టడానికి పురుషుడు మూర్ఖుడై వుండాలి. -రుడ్యార్డ్ కిప్లింగ్




# శ్రీ వినాయక క్యాటరింగ్

వివాహాది శుభకార్యములకు మీకు కావలసిన
విధముగా వెజ్ & నాన్‌వెజ్ క్యాటరింగ్ చేయబడును.







మా వంటకాలు రుచి చూచుటకై
అతితక్కువ ఆర్డర్ పై కూడా
క్యాటరింగ్ చేయబడును





## జి.వి. శివానంద్

డోర్ నెం.72-25-22, సాయిదుర్గా నగర్,1వ వీధి, లాలాచెరువు,
రాజమహేంద్రవరం. సెల్ : 95050 89950, 9491214652

www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు
# పుస్తకముల పట్టిక
## (Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్** పేజ్ లైక్ చేయండి.

Like us to follow :



**MOHAN PUBLICATIONS**

Rajamahendravaram

0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

# మోహన్ పబ్లికేషన్స్

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాథ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాథవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | ప్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

